# పూర్వాంధ్ర కవులు

'సాహిత్యరత్న, హిందీ, తెలుగువిద్వాన్'

[illegible]

శ్రీ వేంకటేశ్వర ఎంటర్ ప్రైసెస

మండపాటివారివీధి.... విజయవాడ 2.

# మనవి

చరిత్ర జాతికి జీవము. ప్రాచీన చరిత్ర లేని జాతి యనాగరకము. జాతి యెంత ప్రాచీనచరిత్ర కలిగియున్న నంత గొప్పది. చరిత్రలో మాటు మణఁగియున్న రత్నములను త్రవ్వి తలకెత్తుకొని జాతి మురిసిపోవుచుండును. జాతికుత్తేజనమును ఆనందమును ప్రసాదించునది చరిత్ర. జాతి తనగతమును స్మృతిపథమునకుఁ దెచ్చికొని, వర్తమానముతో ననుసంధానపఱచి, భవిష్యత్తునకు పురోగమించుచుండును. ఇది యొక మహాయాత్ర.

అట్లే సాహిత్యమునకును నొకచరిత్ర యున్నది. ఏ భాషకు ప్రాచీన చరిత్ర కలదో యాభాష గొప్పది. అది జీవించియున్నది. లేనిది, కానిది మృతభాష. దేశచరిత్రకు రాజు లెట్లాధారభూతులో సాహిత్యచరిత్రకుఁ గవులట్లు. ప్రధానముగ రాజన్యచరిత్రతో ముడివడియున్నది దేశచరిత్ర. కవుల జీవితముతో, వారి రచనా వ్యాసంగముతో ముడివడియున్నది సాహిత్యచరిత్ర. దేశచరిత్రమున వాఙ్మయ కవిచారిత్రాదికము లాంశికములు. అట్లే సాహిత్యచరిత్రయందు రాజన్య చరిత్రలు. కాని రెండును పరస్పరాశ్రితములు.

సాహిత్యచరిత్రకు కవులు మూల స్తంభములంటిమి. ఆ కవులు జాతికి పూజనీయులు. వారు కష్టించి, పండించి జాతికి కవితాసస్యము లందించినారు. దానిచే పుష్టమైనది జాతి. అందుచే వారి సంస్మరణము జాతి కుత్తేజకము. వారి కవితా విలాసములు జాతి కానందదాయకములు. వారి కావ్యములు జాతి సంపద. తత్పరిరక్షణము జాతికిఁ గర్తవ్యము.

తమ పూర్వగాథలను త్రవ్వుకొనుట జాతికి సహజగుణము. ఆగాథలలో, ఆ త్రవ్వుకొనుటలో నేదియో యపూర్వానందానుభూతి లభించును. శుష్కజీవితము నాగాథలు రసామృతమును వర్షించి చివురింపఁ జేయును. అవి యాతనికి గిలిగింతలిడి, కవ్వించి, నవ్వించి, యలరించును. ఆ యానందముతో జాతి మఱల కొంతకాలము జీవించును. కావుననే యా గాథలు జాతి జీవనమున కలసిపోయినవి.

ముఖ్యముగ పూర్వకవుల ప్రతిభాగాథలు, వారి చాటువులు మనల నెక్కువగ రంజింపఁజేసి, తలఁచుకొనినపుడెల్ల ననిర్వచనీయానందము నొసఁగుచున్నవి. కాన మనము వానిపై నాకర్షింపఁబడుచున్నాము.

పెద్దలందేగాక పిల్లలందును నీ ప్రవృత్తి కాన్పించుచున్నది. ఈ యంత్ర యుగమున, జీవితము మ్రోడువాఱిపోవుచున్న యీ సమయమున నిట్టిగాథల ప్రచారమెంతో యవసరము.

తెనుఁగున కవిచరిత్ర లున్నవి. కాని యవి విద్యాధికులకే యుపకరించును. అందు కవికాల నిర్ణయాదికములతో, కవితాగుణదోష విమర్శనలతో, తర్క వితర్క పూర్ణమై సామాన్య బుద్ధుల నాకర్షింపఁ జాలకున్నవి. కవిజీవితమందలి పరమార్థమును, కవి వ్యక్తిత్వమును ప్రకాశింపఁజేసి విద్యార్థుల నాకర్షించి రంజింపఁజాలకున్నవి.

సామాన్య పాఠకునికిఁ గావలసినది యాకవి వ్యక్తిత్వము. ఆతని జీవిత విధానము. నాటి సంఘమున నాకవికిఁగల స్థానము. ఆతని ప్రతిభావ్యుత్పత్తులు. ఇవి తెలిసిన పిమ్మట నందలి సత్యాసత్య నిర్ణయమున కాతఁడే యుత్సహించును. అనగా పాఠకుని మనస్సు సాహిత్యోన్ముఖమైన దన్నమాట.

ఈ లక్ష్యము నాశించియే యీ కవుల చరిత్రలు రచింపఁబడినవి కవి కాలనిర్ణయమునకు ప్రాధాన్య మీయలేదు. వివాదాంశముల జోలి పోలేదు. అనుస్యూతముగ వచ్చుచున్న గాథలను విడువలేదు. కవితా గుణ దోష విమర్శనమునకుఁ గడంగలేదు. వివాదాంశములను కథావిధానమున సాధ్యమైనచో సమన్వయ మొనరింప యత్నించితిని. వీలుకానిచోట వదలివేసితిని. అట్లని యసత్యమును సత్యముగా విద్యార్థులకు భాసింప జేయలేదు. విద్యార్థుల మానసమును తర్క వితర్కములతో విసిగింప రాదనియే యట్లొనర్పవలసి వచ్చినది. కవి వ్యక్తిత్వమును ప్రదర్శించుటకే యధిక ప్రయత్న మొనరింపఁ బడినది.

ఈ నా ప్రయత్నమువలన విద్యార్థులలో సాహిత్యతృష్ణ యేమాత్ర ముదయించినను నా ప్రయత్నము సఫలమైనట్లే! విద్యాధికులీ ప్రయత్నము నాశీర్వదింప గలరని విశ్వసించుచున్నాను.

—రచయిత.

# స్మృతి పూజ

సీ. ప్రభవించె నేవంశ పాథోధి చంద్రుఁడై
వేంకట కృష్ణయ్య వేదవిదుఁడు
రహియించె నెచట నారాయణ దీక్షితుఁ
డాధాన ధార్మికుం డమలయశుఁడు
మించె నేయింటిలో మృత్యుంజయ తపస్వి
నిరతాగ్నిహోత్రుండు నిర్మలుండు
క్రతువు లొనర్చె వేంకటసోమయాజులు
వేదకర్మాభి నివేశుఁ డెచట
తనదుపాండిత్య మాంధ్రావని నింపెనే
రామావధానులు రమ్యయశుఁడు

తే. అట్టి నోరివారి కొలమునందు బుట్టి
బ్రహ్మవిద్యారహస్యంబు వడసినట్టి
సూర్యనారాయణాఖ్యుని శుభ్రయశుని
మత్పితరు గొల్తు నెపుడు మహితభక్తి.

సీ. హారీత గోత్ర మహాంభోధిచంద్రుఁడై
పరమపవిత్రుఁడై వరలె నెవఁడు
శ్రీ శంకరాచార్య శ్రీపాదపద్మంబు
మదినిల్పె సతతంబు మాన్యుఁ డెవఁడు

వేంకటరమణాఖ్య విద్వద్గురుని పాద
పద్మ కృపాలబ్ధిఁ బడసె నెవఁడు
శ్రీచక్రవాసినీ చిచ్ఛక్తి కరుణా ర
సామృత లబ్ధమహాత్ముఁ డెవఁడు

తే. సంతతాన్నప్రదాతయై సకలధర్మ
కర్మనిర్వహణభాగ్యంబు గాంచె నెవఁడు
అట్టి సూర్యనారాయణు ననఘు జనకు
గొల్తు తత్తపోలేశంబు గోరి యెపుడు.

ఉ. మానక వేదకర్మరతి మానుషజన్మము సార్థకంబుగా
జ్ఞాన తపోనిధానుఁడయి చారువచోవిభవంబునన్ సదా
పూనికతోడ లోకమున బూజ్యతగాంచిన ధీగుణోత్తమున్
దానగుణుండు మత్పితరు ధన్యుని గొల్తును నాశిషార్థినై.

ఉ. ఓమహనీయకీర్తి! కరుణోదధి! సంతత దేవపూజనా
కాముక అంబికా చరణకైరవలగ్న మనస్వి నేఁడు నే
నేమముతోడుతన్ దలచి నిన్నిటు గ్రంథము సంతరించితిన్
ప్రేమము మీఱగా గొనుము ప్రీతిని జేయుము నన్ను
నిచ్చటన్.

శా. జనకా! మమ్ముల నెంతయున్ విశదవాత్సల్యంబునన్
బ్రోచినా
వనఘా! నీదు తపోమహత్త్వమును విద్యాగౌరవంబిచ్చి మ
మ్మనయంబున్ సుజనాత్ములై పరగున ట్లారీతి పోషించియున్
తనయుల్ దుఃఖమునందగా దివికి విద్యారూఢ నీ వేగితే!

తే. ప్రేమతో బెంచి పోషించి పెద్దఁ జేసి
వినయవిజ్ఞాన సద్గుణవితతు లొసఁగి
సంచితానేక జన్మసంస్కార మొసఁగి
మనుజుగా జేసితివి నన్ను మాన్యచరిత!

తే. పుత్త్రులేవురఁ బ్రీతితో బుద్ధులొసఁగి
పంచప్రాణాలుగా నెంచి పెంచినావు
నీదు ఋణమెట్లు తీర్పగానేర్తు మేము
ఇట్టి అశ్రుతర్పణముల నిడుటకంటె.

తే. నీవొసంగిన సంస్కారనియతి జేసి
యేర్చికూర్చిన గ్రంథంబు నిట్లు నీకు
నంకితంబిత్తు భక్తితో నమలచరిత!
కొనుచు నాశీర్వదింపుము కూర్మి నన్ను.



'జయ హరహర మహాదేవ' యనెడు భక్తుల జయనాదములు దేవాలయమంతటను ప్రతిధ్వనించుచుండెను. దేవాయతన విజయఘంటికా నాదములో జయనాదము లకుఁ దాళము వేయుచుండెను. నాడు మహాశివరాత్రి యగుటచే భీమేశ్వరాలయము భక్తబృందములచేఁ గ్రిక్కిరిసియుండెను. మహాన్యాసపూర్వక రుద్రాభిషేకములు, బిల్వార్చనలు, వేదపారాయణము, ఉపనిషచ్ఛ్రవణము, పురాణశ్రవణములచే దేవాలయమంతయుఁ గోలాహలముగనుండెను. భక్తిభావ ప్రేరితులై స్వామి కుపహారముల గొనివచ్చిన భక్తసందోహముచే ముఖమండపమంతయు నిండియుండెను. కామ్యసిద్ధికై యసంఖ్యాక స్త్రీజనము స్వామిగుడికి ప్రదక్షిణలు చేయుచు ప్రాణాచారములు పడియుండిరి, దూరదేశాగతులైన భక్తకోటిచే ద్రాక్షారామము అమరావతికి పోలియుండెను.

మహాశివరాత్రికి స్వామిదర్శనమునకై వేములవాడ నుండి యసంఖ్యాకముగ జనసందోహము బయలుదేరి ద్రాక్షారామముఁ జేరెను. స్త్రీలు, బాలురు, వృద్ధులు నందఱి యందును భక్తిభావ మావేశించి వారికి నూత్నోత్తేజ మొసంగుచుండెను. స్నాన మాచరించి కొందరు స్త్రీలు ఆలయములోని కేఁగిరి. స్వామికి మ్రొక్కులు చెల్లించువారు

కొందఱు; తమ యీప్సితములు నెఱవేరినచో లక్షబిల్వార్చనలు, దీపదానములు చేయుదుమని మ్రొక్కుచున్నవారు కొందరు. సంతాన లాభము కలిగినచో నీ పేరు పెట్టుకొందుమనువారు కొందఱు. ఆనాడు మానవజాతియందు గుప్తములైయున్న కోర్కె లన్నియు స్వామిముందు బహిర్గతములు కాజొచ్చినవి.

పుణ్యస్త్రీలకు కొంచెమెడముగ నిలువఁబడి యీ వింతలను చూచుచున్న దొక భక్తురాలు. పరమాత్మ సాన్నిధ్యమున మానవులు కోరుచున్న నీచములైన కోర్కెల కామెకు నవ్వు వచ్చినది. మేరువు పర్వతమును జేరి గుండ్రాతిని కోరినట్లు మోక్షప్రదాతయగు భీమేశ్వరుని సన్నిధిని భౌతికముల నపేక్షించు భక్తుల మూఢత్వమున కామె నవ్వుకొనినది. ఆమెలోని తాత్విక భావము, చమత్కారముతోఁ గలసి వాగ్రూపమున బయలు వెడలినది. "నాకును నీవంటి పుత్త్రుఁడు కలిగినచో పుట్టెడు నీటితో దీపారాధన మొనర్చి నీపేరు పెట్టుకొందును స్వామీ!" యని.

ఈ మాటలు వినినంతనే ప్రక్కనున్న పూబోడులు పక్కున నవ్విరి. 'వితంతువునకు పిల్లలేమిటే! నీకు పిల్లలు కలుగుట యెట్లే?' యని వారందఱు నామెను పరిహసించిరి.

నిరుపేదరాలును, విద్యావతియునైన యా బాలవితంతువు వారింగాంచి—'అమ్మలారా! అర్థిజన కల్పవృక్షమైన భీమేశ్వరస్వామి సన్నిధిని మీరిట్టి తుచ్ఛమైన కోర్కెలు

కోరుచుంనుట నా కాశ్చర్యజనక మైనది. మీరా భగ వానుని కోరవలెనా? తన బిడ్డల కెవరి కేమి కావలెనో యాతండ్రి యెఱుంగడా? ఆపద మ్రొక్కులు మ్రొక్కి మీ కోరికలు సఫలముచేయు భగవానుఁడు పరిహాసమున కైనను నేను కోరిన కోరిక సఫల మొనర్పకుండునా?' యనెను.

కొందఱా మె మాటలలోని పరమార్థమును గుర్తించిరి. కొంద ఱామె మాటలకు మూతి విరచిరి. కొందరు పరి హాసించిరి—'ఘొట్టిముండకు పిల్లలు కావలెనట. ఆ యిండ్ల కాయిండ్లకేఁగి పాటలు పద్యములు చెప్పి పొట్టపోసికొను పుట్టుకుంక మనలను పరిహాస మొనర్చుచున్నది.'

శివరాత్రి యుత్సవములు ముగిసినవి. ఎవరి యిండ్లకు వారేఁగిరి. కొన్ని మాసములు కాలగర్భమున కలిసి పోయి నవి. భక్తత్రాణ పరాయణుఁడు, అర్థార్థి కల్పశాఖి, యా భీమేశ్వర స్వామి కా భక్తురాలియెడ కరుణ కలిగినదో, లేక యామె తాత్త్వికదృష్టి కానంద మాయెనో, లేక భక్తు లకు తన సామర్థ్యము జూప నెంచెనో, యా బాల వితంతువు గర్భము దాల్చినది. వేములవాడలోని జనులు గుజగుజలు వోయిరి. చాటు మాటున నా బాలవితంతువును దిట్టుకొనుచు తమ పాతివ్రత్యములను నిరూపించు కొనుచుండిరి. ఆనోట నానోటఁబడి యా విచిత్రోదంతము గ్రామమున బట్టబయ లైనది. ఆ ధీరస్వాంత, విద్యావతి, భీమేశ్వర కృపాపాత్రమైన వితంతువు మాత్రము చలింపలేదు. భగవత్ప్రసాదము నా

భక్తు రాలెట్లు తిరస్కరింపగలదు? భగవత్ప్రసాద స్వీకరణ మున లోకభయ మెందుకు?

భీమేశ్వర ప్రసాదమున నామెకు మగశిశువు కలిగెను. గ్రామస్థు లామె నపహ్యాంచుకొనిరి. భగవత్ప్రసాదమున నామెకు పుత్రుఁ డుదయించెనను మాటను వారు విశ్వసింపఁ జాలక పోయిరి. వారికి భగవంతునిపై, ఆతని శక్తి సామర్థ్యములపై గల విశ్వాస మట్టిది! అఘటనా ఘటనా సమర్థుఁడైన భీమేశ్వరస్వామి సామర్థ్యమునే శంకించి యూ యూరివా రామెను బహిష్కరించిరి. భక్తులకు బహిష్కారమేమి? ఎందఱి భక్తులను లోకము బహిష్కరించి కష్టములపాలు చేయలేదు! ఆమె యీ లోకాపవాదమునకు, బహిష్కారమునకు జంకలేదు. తన పుత్రునకు భీమేశ్వరస్వామి పేరు పెట్టినది. సాధ్యమైనంతవఱకు లోకపుదృష్టిని తప్పించి తన కుమారుని పెంపసాగెను. విద్యావతి యైనందున తానే బిడ్డనికి విద్యాబుద్ధులు నేర్పసాగెను.

బాలకుఁడైన భీమన పెఱిగి తోడిబాలురతో నాటపాటలతోఁ గాలముఁ బుచ్చుచుండెను. తల్లివద్ద విద్యాభ్యాస మొనర్చు చుండెను. గ్రామస్థుల క్రూరదృష్టులు, వారి వ్యంగ్య వచనములు, బాలుఁడైన భీమన కర్థమయ్యెడివి కావు. తనను గౌరవించుట లేదనియు, తోటివారితో బాటు ఆదరించుట లేదనియు మాత్రమే యా పసిమెడందకుఁ దెలియును. అందఱి పిల్లలవంటివాఁడు కాఁడా తాను? మఱి తన్నెందు కింత హేయముగ జూచుచున్నారు, నను, అంద

రితో బాటు భోజనమునకుఁ బిలువ రేమి? నన్నుఁ జూచి గుసగుసలు వోవుదు రేల? ఇవి యా బాలహృదయమును వేధించుచున్న ప్రశ్నలు.

బాలుఁడైన భీమన యొకనాఁడు తోడి బాలురతో నాఁడు చుండెను. ఆటలో మాటలో నుద్దండుఁడై మించిన భీమన్నను బాలుఁడొకఁ డీసున 'ముండకొడుకా!' యని పరిహాసించెను. మిగిలిన బాలురందరును నవ్విరి. భీమనకు గోపమువచ్చి తన్నుఁ దిట్టిన బాలుని కొక్కటి వడ్డించెను. కాని యాతని కోపము చల్లారలేదు. పిల్లలాతని చుట్టును జేరి నీకు తండ్రి లేడు. మీ నాయన పేరేమో చెప్పు' మని యింకను పరిహాసింపసాగిరి. పరాభూతుఁడైన భీమన యట నిలువఁజాలక చరచర యింటికేఁగి తన తండ్రి యెవరో చెప్పుమని తల్లిని బలవంతముఁ జేసెను. ఏమని చెప్పగలదా యిల్లాలు? కల్లబొల్లి మాటలతో మఱపించుటకు వెనుకటి భీమన కాఁడీతఁడు. లోనజ్ఞాన మించుకకలిగి భీమరూపమున నడుగుచున్నాఁడు. తల్లి యించుక కలవరపడి మఱల నంతలోనే తేఱుకొని యిట్లన్నది— 'నాయనా! నీవు సామాన్య మానవులవంటి వాఁడవుకావు నీ తండ్రి సామాన్య మానవుఁడు కాఁడు. ఆ భీమేశ్వరస్వామి వద్దకేఁగి యాతని నడుగుము.'

భీమన చరచర భీమేశ్వరాలయముకేఁగి లింగమును కౌగలించుకొని 'నాతండ్రి యెవఁడో చెప్పు'మని బ్రతిమాలెను. ఆ పాషాణ లింగ మేమని చెప్పగలదు? అక్కసు నాన

స్సులోని వేదన యధికమైనది. 'నా తండ్రి యెవఁడో చెప్పె దువా? లేక నీతల బ్రద్దలుకొట్టి నా తల బ్రద్దలుకొట్టు కొమ్మం దువా?' యని సరోషముగ బ్రశ్నించెను. స్వామి కా యసహా యక బాలభక్తునిపైఁ గరుణ కలిగినది. 'ఓయీ! నీ జనని మహాభక్తురాలు. ఆమె పుత్త్రలాభమును గోరినది. వితంతు వైనను నిష్కల్మష భక్తితో గోరిన కోరికను దీర్చి నిన్నను గ్రహించితిని. నీకు నేనే జనకుఁడను.' అని భీమేశ్వరస్వామి యనెను.

'ప్రభూ! నీవు నా జనకుఁడవైనచో నన్నితరులు గోళకుఁడని నిందింపనేల?'

'ఓయీ! లోకులు పలుగాకులు. వారు నన్ను పూజిం తురు గాని నాపై విశ్వాసముతో గాదు. వారి యవసరముల కొఱకు. వారి యవసరములను దీర్తునను నమ్మకము వారిలో నున్నదిగాని యా విశ్వాసము సంపూర్ణమైనదికాదు. అందు చేతనే వారు భగవత్కృత్యముల నప్పుడప్పుడు నమ్మజాలరు. వారి నింకను మోహము వదలలేదు. తమకు పుత్త్రలాభము గూర్చు భగవానుఁడొక వితంతువునకు సైతము పుత్రు నొసంగ జాలునని వారు విశ్వసింప లేకున్నారు. అది వారి యజ్ఞానము సుమా!'

'అట్టి యజ్ఞానుల మధ్య నా జీవితము సాగుటెట్లు? నా తల్లిని నన్ను వెలివేసి హింసించుచున్నారే! మాగతి యేమి కావలె?'

'వత్సా! నీ వనినది నిజమే! మా జీవయాత్ర సాగ వలెనుగదా! అందుకై నేను జనుల మానసమును మార్చుట కంటె నీ కొక వరమును ప్రసాదింతును. నీవు సమస్త విద్యా పారంగతుఁడవై నీ వాడిన దాటయు పాడినది పాటయు నగును. సంఘమున నీ మాటకిక తిరుగులేదు. ఎంతటివారైనను నీ వాక్యనకు లోబడ వలసినదే!

ఈ కథ కేవలము కల్పిత మనుటకు వీలులేదు. భీమకవి సంస్కృతమున రచించెనని చెప్పఁబడుచున్న జ్యోతిష గ్రంథము నాంధ్రమున విరచించిన యొకకవి యాతని జన్మ పకార మిట్లు నుడివినాడు.

శ్రీకరంబై ధరఁ జెలువుగాంచినయట్టి
భీమపురంబునఁ బ్రేమమీర
భీమేశ్వరుండును బ్రియముతో భక్తుల
కోర్కు లొసంగుచుఁ గొమరు మిగుల
నొకనాఁడు తత్పురి యువతులు కొందఱు
భక్తి భీమేశ్వరు భవనమునకుఁ
బోయి పుత్రులవేడ ముగ్ధత్వమున నొక్క-
విధవ కుమారుని వేడ్కఁగోర
నాలేమ ముగ్ధత కపహసించుచు నల
భీమేశ్వరుఁడు పుత్రుఁ బ్రీతి నొసఁగె
నా కాంత గర్భిణియై కాంచెఁ దనయుని
గలియుగాదిని బ్రేమ కడలు కొనగఁ

ప్రభవ వర్షంబున శ్రావణమాసంబు
శుక్లపక్షంబున శోభనంబు
మీఱఁ బంచమి శుక్రవారంబునను హస్త
యందుఁ గన్యా లగ్నమందు వెలయ
వెలిపెట్టి రక్షాంత విధవ నా పుత్త్రుఁని గాంచె
నని నింద మెడగట్టి యఖిల జనులు
నంత తత్తనయుండు నైదేండ్ల బాలుఁడై
పురి బాలకులతోడఁ బొసగనాడ
జనులెల్ల గోళకుండని. నిందఁజేసిన
రోషించి యాతండు దూషితయని
తామెత్తి తల్లిపై నేయఁ బోయిన నది
భీమేశ్వరుఁడు తండ్రి వేయు మనిన
వెసఁజని యాతని వేయ నుంకించిన
భీమేశ్వరుడుదయ పెద్దగలిగి
ప్రత్యక్షమయి, వత్స! రమ్మని తగఁ జీఱి
పసుపక్షి మృగములఁ బ్రాణికోట్ల

* · * *

గలిగించు శక్తియుఁ గరమొప్ప జనులకు
బిడ్డల నాయువుఁ బెంపుఁ దనర
సంపద లొసఁగెడి సామర్థ్యమును మఱి
కానిది యౌనని యైనదెల్లఁ
గాదని యట్టుల కావించు బలమును
మును రాఁగలుగునదియును దెలుపగ

ప్రావీణ్యమును నిచ్చి ప్రబలుము నీవని
వరమిచ్చెఁ బదియారు వర్షములకు
నాతనికి సహాయమై సరస్వతియును

* * *

నతఁడెట్లు చెప్పిన నట్ల చేయుచునుండె
సరిలేని కీర్తిచే జగతి వెలసి
యతఁడు చెప్పిన శాస్త్ర మందధిక భక్తి
కలిగి నిజమని తలచినఁ గల్గు శుభము
కోర్కె లెల్లను ఫలియించు గురుతరముగ
సకల జనులకుఁ దప్పదు జగతిలోన.

భీమన భీమేశ్వర వరప్రసాదముఁ బొంది యింటికిఁ దిరిగి వచ్చెను. ఇప్పటి భీమనలో జంకుగొంకులు లేవు. ఆత్మ సంతృప్తి, ఆత్మ విశ్వాసము నాతనిలో నిండుగా నెలకొనెను. సంఘదూషితుఁడైన యాతఁడు సంఘమును లెక్కచేయుట లేదు. తన్ను వెలివేసిన సంఘమును తానే బహిష్కరించెను. కాని తన గొప్పదనమును, తన యాభిజాత్యమును వెల్లడింప వలెనను కుతూహలము కలిగెను. భీమేశ్వర వరప్రసాద లబ్ధుఁడైన తనను లోకులిట్లు పరిహాసించుట, యవమానించుట నాతఁడు సహింపలేకపోయెను. తన జన్మ ప్రకారమును, భీమేశ్వరవచనములను, భగవత్సాక్షాత్కారమును తెలియ జెప్పినను వినువారెవరు? కలియుగ భక్తుల కంతటి విశ్వాస మెక్కడిది?

వేములవాడలో నొకనాడు బ్రాహ్మణులయింట సంత ర్పణ జరుగుచుండెను. గ్రామమందలి బ్రాహ్మణు లందఱు నాహూతులైరి. భీమనను పిలిచినవారు లేరు. భీమన కది సహింపరాని యవమాన మయ్యెను. అతిథు లందఱు నేతెంచిరి. వడ్డన పూర్తియైనది దేవతా నివేదనలు పూర్తి యైనవి. బ్రాహ్మణులు పరిషేచన మొనర్పనుండిరి. ఇంతలో వీధియరుగుపైఁ గూర్చుండియున్న భీమన—'అప్పాలన్నియుఁ గప్పలు కావలె, అన్నమంతయు సున్నము కావలె' నని శపించెను. ఇంకేమున్నది ! ఆతని శాపము సత్యమై వి_స్తళ్ళలోనున్న యన్నము సున్నమై, అప్పములు కప్పలై యెగురజొచ్చెను.' ఆకలితో నావురావు రనుచున్న బ్రాహ్మ ణుల కాశాభంగమైనది. యజమానికి తీరని పరాభవము కలిగినది. ఒకరిమొగ మొకరు చూచు కొన సాగిరి. ఇందుకు నిమిత్తమేమి? ఇపు డేమి చేయవలె?

ఇంతలో వీధియరుగుపై గూర్చుండి 'మీ పప్పలు కప్పలుగాను, మీ యన్నము సున్నముగాను' యనుచు పాడుచున్న భీమన కాన్పించెను. ప్రత్యక్షముగ నాతని ప్రభా వమును గాంచిన యజమాని పశ్చాత్తప్తుఁడై యాతనిని శాప ముపసంహరింపుమని ప్రార్థించెను. బ్రాహ్మణు లాతని మహత్త్వము నంగీకరించిరి. ఉపనయనాది సంస్కారము లొనర్చి బహిష్కారమును తొలగించుట కంగీకరించిరి. వెంటనే పంక్తిభోజనమునకు సైతమాహ్వానించిరి. భీమన 'సున్నము అన్నము గావలె, కప్పలు పప్పలుగావలె' ననినంతనే యథా

పూర్వముగ విస్తళ్ళు భోజ్యములతో నిండెను. నాటికి బ్రాహ్మణుల క్షుధాగ్ని చల్లారినది. నాటినుండియు నూరిలోనివారి కాతఁ డనిన భయమైనది. ఆతని కెదురాడువారు లేరైరి. ఆతని ప్రశస్తి దేశమంతటను బ్రాకెను.

నాటినుండియు నీతఁడు కవిత్వముఁ జెప్పుచు రాజులను మెప్పించుచు నప్రతిహత వచనుఁడై జీవయాత్ర సాగించుచుండెను. జను లాతని నుద్దండ కవియనియు, కవిరాక్షసుఁడనియు బిలుచు చుండెడివారు. ఎచట కేఁగినను నాతఁడసాభిమానముతో దనున్న ద్రాక్షారామ భీమేశ నందనుఁడ ననియే చెప్పుకొనుచుండెను. తెలుఁగురాయని సభ కేఁగి యాతనితో నేమనెనో చూడుడు.

"ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ ద్రాక్షారామ భీమేశ నం
దనుఁడన్ దివ్యవిషామృత ప్రకట నానాకావ్యధుర్యుండ భీ
మన నాపేరు వినంగఁ జెప్పితిఁ దెలుంగాధీశ! కస్తూరికా
ఘన సారాది సుగంధ వస్తువులు వేగందెచ్చి లాలింపురా!

ఈ వచనములలో నాతని యుద్దండ స్వభావము, స్వాభిమానము, నిర్లక్ష్యము స్పష్టముగ గోచరించుచున్నవి. భీమన మహాప్రభంజనుఁడు. అతఁ డేగరాని చోటులు లేవు. అతని కెదురై నిలచువారు లేరు. అతనిముందు నమ్రులైనచో కరుణించెను. ధౌర్త్యమున నెదురొడ్డినచో నేలగూల్చెను. భీమేశ్వర వరప్రసాద కలితుఁడు అప్రతిహత వచనుఁడు, క్రాంత దర్శియైన కవి! ఆతని కెదు రేదీ?

ఒకనా డాతఁడు రాజకళింగగంగును చూడబోయెను. కళింగగంగు కార్యభారములో మునిగియుండి కోపముతో 'ఇది సమయముకాదు. సందడి తీరిన తరువాత రమ్మ'నెను. భీమన కిది యవమానజనక మైనది. కాదామఱి? కవిశేఖరుని కలియుటకు సమయము కాదనుటయా? తరువాత రమ్మను టయా? ఆత్మగౌరవమే ప్రాణముగా జీవించు కవిశిఖామణు లిట్టి యనౌచిత్యములను సహింపగలరా? కవులు సేవకతు ల్యులా తరువాత రమ్మనుటకు? భీమన కోపించినాడు— భీమనకాదు కవియే కోపించినాడు.

'వేములవాడ భీమకవి వేగమె చూచి కళింగగంగు తా
సామము మాని కోపమున సందడిదీఱిన రమ్ము పొమ్మనెన్
మోమునుజూడ దోషమిఁక ముప్పదిరెండు దినంబు లావలన్
జామున కర్థమందతని సంపద శత్రులఁ జేరుగావుతన్.'

కవివాక్కు వ్యర్థముకాదు— ముమ్మాటికిని సత్యము—

బిసరుహ గర్భు వ్రాతయును విష్ణుని చక్రము వజ్రి వజ్రమున్
దెసలను రామబాణము యుధిష్ఠిరు కోపము మౌనిశాపమున్
మసకపుఁ బాముకాటును, గుమారునిశక్తియుఁ గాలు
దండమున్
బసపతి కంటి మంటలును బండిత వాక్యము రిత్తవోవునే!

ఆ మాటలు కళింగగంగు పాలిట మారణాస్త్రము లైనవి. నిజముగనే శత్రులాతని రాజ్యము నాక్రమించి కళింగగంగును వెడలగొట్టిరి. శత్రుభీతిచే నాతఁడు మారు

వేషమున నొకనాటి రాత్రి చీకటిలో భీమన యింటి ముందరి పాతరగోతిలోఁబడి 'యంతటిమహావైభవముతో బ్రతికిన నాకు నేడొక కాలిదివ్వెయైన లేకపోయెనుగదా! యని దుఃఖించు చుండెను. ఇంతలో పాదప్రక్షాళణమునకై బయటకు వచ్చిన భీమన యాతనింగాంచి 'నీవెవ్వఁడ'వని ప్రశ్నించెను. అందుల కాతఁడు 'వేములవాఁడ భీమకవి చేసిన జోగిని నే'నని సమాధాన మిచ్చెను. అది విని భీమన యాతనిపైఁ గరుణించెను. 'నిండు మనంబు నవ్య నవనీత సమానము పల్కుదారుణాఖండల శస్త్రతుల్యము విప్రులందు' అనిగదా కవి చెప్పినది! విప్రులందే గాదు— కవులందును నది సత్యమే! నిగ్రహానుగ్రహ సమర్థులుగదా కవీశ్వరులు! కావుననే రాజులు, చక్రవర్తులు వారి నాశ్రయించి బ్రతికిరి.

భీమన కళింగగంగు స్థితిని జూచి జాలి చెందెను.

'వేయి గజంబులుండఁ బదివేల తురంగములుండ నాజిలో
రాయలగెల్చి సజ్జనగరంబునఁ బట్టము కట్టుకో వడిన్
రాయ కళింగగంగ! కవిరాజు భయంకరమూర్తి చూడఁదా
బోయిన మీనమాసమునఁ బున్నమపోయిన షష్ఠినాటికిన్.'

కవి యొసఁగిన యాశీస్సువలన గళింగగంగుకు కొండంత ధైర్యము కలిగినది. శత్రువులను నిర్జించి సజ్జనగరమును తిరిగి యాక్రమింపఁగలనను ధైర్య మంకురించినది. కాని యెట్లు? తాను నిస్సహాయుఁడు. రాజ్యచ్యుతుఁడు. సైన్యములేదు. పరివారములేదు. పగటివేళ తాను పదిమంది కంటికిఁ గనబడుటకైనను వీలులేదు. సజ్జ నగరాధిపతి వేయి

కండ్లతో నప్రత్యుఁడై చారచక్షువుల నాతనికై యన్వేషించు చుండెను. ఆనాటిరాత్రి గడచినది. కళింగ గంగస్లే శీమన యింటిముందు కూర్చుండి యుండెను. ఇంతలో గొందఱు భాగవతులు విచిత్రవేష విన్యాసములతో నచటి కరుదెంచిరి. నాలుగైదు దినములనుండి వారస్లే గ్రామమునందుండి వేష ములు వేయుచుండిరి. వారిని గాంచినంతనే కళింగగంగు మన సున నొక యుపాయము తళుక్కున మెఱసెను. అతఁడా భాగ వతుల వినోదవేషములఁ దిలకించుచు వారిని వెంబడించి వారున్న విడిదికేఁగెను. ఆజట్టు నాయకునిఁజేరి వారు దేశా టన మొనర్చుచు సజ్జనగర మేగుచున్నట్లు తెలిసికొనెను. తననుగూడ జట్టులోఁ జేర్చుకొమ్మని ప్రార్థించెను. క్రొత్త వాఁడైనను, కుతూహలము గలవాఁడు గావున వా రాతనిని జట్టులోఁ జేర్చుకొనిరి.

సజ్జనగరమున విజయోత్సవములు పెల్లుగ నుండెను. భాగవతులగుంపు సజ్జనగరముఁ జేరెను. వారు విచిత్ర వేష ములు దాల్చి రాజసభ కేఁగి రాజును రంజింపఁజేసిరి. వారి కౌశలమునకు మెచ్చి రాజు కుతూహలముతో మాచే జయిం పఁబడి, దిక్కులేక యల్లాడుచు దేశదేశముల గ్రుమ్మరు చున్న కళింగగంగు వేషమువేసి మమ్ము సంతోషపెట్ట గలరా? యని ప్రశ్నించెను.

జట్టునాయకుఁ డించుక సంశయించెను. వారంతకు పూర్వ మా వేషము వేయలేదు. అందుకై వారు సిద్ధపడి రాలేదు. రాజుకోరినది సామాన్యవేషముకాదు. సజీవుఁడై

యున్న రాజువేషము. ఆతని రూపురేఖలు గలవాఁడొకఁడు కావలె. అంతటితోఁగాదు. కళింగగం గీ రాజునకు శత్రువు. ఈతనిచే పరాభూతుఁడు. కాన నాతని నవమానించునట్లు కథ నడుపవలె. కష్టసాధ్యమైన పని. నాయకుఁ డిట్లాలోచించు చుండగా సామాన్యవేషమున జట్టులోనున్న గంగు నాయకునితో నే నా వేషము వేసెదనని చెప్పి యొప్పించెను. నాయకుఁడు సజ్జనగరాధిపతితో రేపు కళింగగంగు వేషము వేసెదమని చెప్పి నాటికి సెలవు తీసికొనెను.

కళింగగంగు భావికార్యము గుఱించి యాలోచింపఁ దొడగెను. వేషమునకై వెదుక నక్కఱలేదు. వేషమున కొక గుఱ్ఱము, కత్తికావలెనని రాజునకుఁ గబురంపిరి. రాజు సంతోషముతో నుత్తమాశ్వమును, కత్తిని భాగవతులకుఁ బంపెను. వేషము పూర్తియైనది. కళింగగంగు తన పూర్వపు దుస్తులను ధరించెను. ఒకఁడు సజ్జనగరాధీశుని వేషమువేసెను.

భాగవతులు కొలువుకూటమును జేరిరి. ఆట ప్రారంభ మాయెను. వారి కలహ కారణములు, రాయబారములు, యుద్ధసన్నాహములు వర్ణింపఁబడెను. యుద్ధము నిశ్చిత మైనది. యుద్ధరంగమున సజ్జనగరాధీశుఁడు, కళింగగంగు ప్రత్యక్షమైరి. సభ్యులందఱును కళింగగంగు వేషమునుగాంచి నిజముగ కళింగ గంగేయని భ్రమించి నిర్నిమేషులై చూచు చుండిరి. సజ్జనగరాధిపతియు గంగువేషమంత చక్కగ కుదు రినందు కద్భుతమందు చుండెను.

ద్వంద్వ యుద్ధము ప్రారంభమయ్యెను. ఆతుముల యుద్ధమునుగాంచి సభ్యులు నిర్విణ్ణులైరి. ఆట రక్తి గట్టు

చున్నదని రసికు లనుకొనుచుండిరి. ఇంతలో కళింగగంగు ఒక్కుమ్మడి సింహాసనముపైనున్న సజ్జనగరాధీశునిపైకి లంఘించెను. మఱుక్షణమున సజ్జనగరాధీశుని శిరము పాద పీఠముపైనుండి దొర్లి సభలో పడెను. కళింగగంగు ఉగ్ర మూర్తియై సింహాసన మధిష్ఠించెను. తానే కళింగగంగునని ప్రకటించెను. సభ్యు లొక్కింతతడవు నిశ్చేతనులై యుండిరి. కవివాక్యము సత్యమైనది. సజ్జనగరమునఁ బట్టము గట్టుకొని నాఁడు కళింగగంగు.

భీమన యొకనాఁడు చాళుక్య వంశజుఁడైన చొక్క రాజు వద్దకేఁగెను. చొక్కరాజు తన యుద్యానవనమున మల్లె సాల స్తంభముమీఁదఁ గాలుచాచి కూర్చుండెను. భీమకవి స్వీయపరిచయమును వినిపించిన పిమ్మట చొక్కరాజు నీవంతటి సామర్థ్యము గలవాఁడవేని యీ స్తంభమును మఱల వృక్షముగా నొనర్పఁగలవా యని ప్రశ్నించెను. వెంటనే భీమకవి—

ఆసీతాభ్యుపదాన శృంఖల పదాభ్యాలంచిత స్తంభమా
నేనే వేములవాడ భీమకవినేనిం జిత్రకూటంబులో
భూనవ్యాపిత పల్లవోద్భవ మహాపుష్పోప గుచ్ఛంబులన్
నానాపక్వ ఫలప్రదాయివగు మానా కల్పవృక్షాకృతిన్"

అనెను.

వెంటనే యా పందిరిగుంజ కొమ్మలతోను, పత్రముల తోను, కిసలయముల తోను, ఫలపుష్పాదులతోను గూడి నదై మహావృక్షముకాగా రాజుకాలు దానిలోఁ జిక్కు

వడెను. అచటనున్న వారందఱాతని కవిత్వశక్తి కత్యద్భుతంబందిరి. రాజు తనకాలు చిక్కువడుటచే మఱల నావృక్షమును స్తంభముగా నొనర్పు మనెను. అంతట భీమన—

శంభువరప్రసాద కవిసంఘవరేణ్యుఁడనైన నావచో
గుంభన చేయ నెంతో యనుకూలతనొంది ఘనూన భావనన్
గుంభినిఁ జొక్కనామనృప కుంజరు పందిటి మల్లెసాలకున్
స్తంభమురీతి నీతనువుఁ దాలిచి యెప్పటియట్ల యుండుమా.

యనెను. వృక్షము యథాపూర్వముగ స్తంభమై పోయెను. చొక్కభూపాలుఁ డనర్ఘ వస్తుసంతతులతో కవిని తృప్తి నొనర్చి ధన్యుఁడాయెను.

భీమకవి యమోఘవచనుఁడని తెల్పు మఱియొకగాథ ప్రచారమందున్నది. రణతిక్కన యుద్ధక్షేత్రమున నిహతుఁడయ్యెను. తిక్కనభార్య భర్తృవియోగమునకు దుఃఖితయై భీమకవివద్దకేతెంచి నమస్కరింపగా నాతఁడామెను 'దీర్ఘసుమంగళీభవ' యని యాశీర్వదించెను.

అంతటనామె— 'కవిశేఖరా! మీ వచన మమోఘము. కాని నాభర్త శత్రునిహతుఁడై, శిరము కళేబరము వేరుచేయఁబడి యుద్ధక్షేత్రమునఁ బడియున్నాడు. మఱి తమ యాశీర్వచన మెట్లు ఫలించునో?' యనెను.

అంతట భీమకవి—

గుణముల నిధానమగు మన
రణతిక్కడు తాఁ గళేబరంబును శిరమున్

గణకమెయిఁ గలయ బ్రతుకును
బ్రణుతాఖిల వైరిమకుట భాసిత పదుఁడై.

యనిచెప్పి మొండెమును శిరమును నేకముగాఁగూర్చి బ్రతికించెను.

ఈ కవియే రణతిక్కన శౌర్యమును, ఆతని ఖడ్గమును బ్రశంసించుచు నీ పద్యముఁ జెప్పెను.

గరళపుముద్ద లోహమవగాఢ మహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్నికొల్మి యురగాధిపు కోఱలు పట్టుకార్లు ది
క్కరటి శిరంబుదాయి లయకాలుఁడు కమ్మరి వైరివీర సం
హరణ గుణాభిరాముఁడగు మైలమ తిక్కని ఖడ్గసృష్టికిన్.

కవులు, పండితులు నింటివద్ద కూర్చుండి యున్నచో వారికి బ్రశస్తి వచ్చుటెట్లు? రాజాస్థానమున కేఁగవలె, అసమాన కవితాచాతుర్యమున రాజులను మెప్పింపవలె. కవిపండితుల జూడవలె. అసమాన వచోగుంభనల వారి నలరింపవలె- లోగొనవలె. లేదా యసమాన పాండిత్య బ్రకర్షను జూపి వాదనాపటిమను మెఱయించి జయించి బిరుదుమగడు కావలె. భీమనవంటి యుద్దండు డింటగూర్చుండి యుండగలడా? ఆనాఁడత డేగని రాజాస్థానములు లేవు. దేశాటనము, రాజాస్థాన దర్శనమే యాతనిపని. కవిత చెప్పుటయే వృత్తి. ఈ రెండునుగలసినదే భీమన జీవన బ్రోతస్విని.

భీమకవి తనగుఱ్ఱమెక్కి దేశసంచారమునకై బయలు దేరెను. కవియెంత స్వతంత్రుఁడో యాతని గుఱ్ఱమున్నంతటి స్వతంత్రమైనదే! కవీశ్వరుని వాహనమున కడ్డుగలదా? ...

విచ్చలవిడి విహరించుచుండెడిది. భీమన కృష్ణామండలస్థమైన గుడిమెట్టవచ్చెను. గుడిమెట్ట పాలకుడు పోతరాజు. భీమన గుఱ్ఱము పోతరాజు పొలములోబడి మేయసాగెను. పోతరాజు సైనికు లాహాయమును బట్టుకొని ప్రభువునొద్దకుఁ గొంపో యిరి. భీమకవి యీ వృత్తాంత మెఱింగి యా గుఱ్ఱము తన దనియు, దానిని విడువవలసినపనియుఁ గబురంపెను. కాని, పోతరాజు దానిని విడువలేదు. పోతరాజు బ్రాహ్మణుల కగ్ర హారాది దానము లొనర్చెననియు, విజయివాటికలో మల్లే శ్వర స్వామికి భూమినొసంగెననియు ననేక దేవాలయములకు దానము లొసగిన త్యాగపురుషుఁడనియు విని యట కేతెం చిన భీమన కీ విషయమువలన కోపము వచ్చెను. అంతటి త్యాగశీలుని కీ చేనిలోఁబడిన గుఱ్ఱము విషయమై యింత పట్టుదల యేమి? రాజశాసన పరిరక్షణమునకై యుండనోపు; లేదా దురదృష్ట మనవచ్చును. లేదా భీమనశక్తి సామర్థ్య ప్రకాశనమున కీశ్వరుఁ డొడగూర్చిన యవకాశ మనవచ్చును. ఏమైననేమి? భీమన యుగ్రహోద్యోగుఁడై నాడు—

"హయమదిసీత పోత వసుధాధిపుఁడారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుడ, సహ్యజవారిధి మారుఁడంజనా
ప్రియతనయుండు లచ్చన విభీషణుఁడా గుడిమెట్టలంక నా
జయమునుఁ బోతరక్కసుని చావును నేడవనాడు చూడుఁడీ!"

కవినోటినుండి శాపాక్షరములు ఛందోబద్ధములై వెడ లినవి. ఇంకేమున్నది? పోతరాజునకుఁ గాలము తీరినది. మంచ మెక్కి మృత్యుముఖముననున్న పోతరాజునకు వైద్యులెన్నో

చికిత్సలు చేసిరి. కాని యవి యన్నియు నిష్ఫలము లయ్యెను. ఎవ్వరో భీమనకవి యొసఁగిన శాపవృత్తాంతమును పోతరాజు భార్యకు వినిపించిరి. ఆమె భీమనవద్దకేఁగి పతిభిక్ష పెట్టుమని దీనాతిదీనముగ విలపించినది. సహజ కరుణార్ద్రమైన కవి హృదయము నవనీత సమానమైనది. ఆమెను వెంటనిడుకొని రాజగృహమునకు వచ్చిచూడగా పోతరాజు చచ్చిపడి యుండెను. భీమకవి యాతనింగాంచి——

నాటి రఘురాము తమ్ముఁడు
పాటిగ సంజీవిచేత బ్రతికిన రీతిన్
గాటికిఁబో నీ కేటికి ?
లేటవరపు పోతరాజ ! లెమ్మా రమ్మా !

భీమన యీ మాట లనినంతనే పోతరాజు లబ్ధప్రాణుఁడై లేచికూర్చుండెను.

ఈభీమకవి కాలముననే మైలమభీముఁడను దండనాథుఁడుండెను. ఆతఁడు మహాపరాక్రమశాలి. సమకాలీనులైన గొప్ప వ్యక్తులందరి తోడను భీమకవికి సంబంధముండెను. వారందఱు నీతని యాశీస్సులను కాంక్షించినవారే! ఈ మైలమ భీముని పరాక్రమమును భీమకవి యిట్లు వర్ణించెను.

చ॥ గరళపుముద్ద లోహమవగాఢ మహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మియురగాధిపు కోఱలు పట్టుకార్లు ది
క్కరులయురంబుదాయి, లయకాలుఁడు కమ్మరినైరివీరసం
హరణ గుణాభిరాముఁడగు మైలమ భీమన ఖడ్గసృష్టికిన్.

ఈ పద్యమునే కొందఱు రణతిక్కన కన్వయింప జేసిరి. కాని మైలమభీమన యాతని కాలమునందుండినవాఁడ

గుటచే నీతనిని గూర్చియే భీమనకవి పై పద్యమును జెప్పి యుండును.

భీమకవికి చోక్కభూపాలునితో మైత్రియుండెను. ఆతడు గొప్పవీరుఁడు. చోక్కభూపాలుఁడు భీమన నాదరించినవాఁడు. భీమకవి చోక్క భూపాలునితో గలసి రామగిరి దుర్గమునకు దండయాత్ర కేఁగెను. అచటి దండనాయకుఁడు సాహిణి మారుడు. ఆతఁడు గొప్ప పరాక్రమవంతుడు. ఆతఁడు చోక్కభూపాలు నెదిర్చి ముప్పుతిప్పలుపెట్టి మూడు చెఱువులనీళ్ళు త్రాగించుచుండెను. దుర్గమును జయింపగలమను నాశ చోక్కభూపాలునకు సన్నగిలెను. తనబలము వ్యర్థముకాఁగా నాతఁడు భీమన నాశ్రయించెను. భీమన తన యాప్తుఁడైన చోక్కభూపాలుని దైన్యమును, మారుని విజృంభణమును జూచి తన యాప్తునికి జయము కలిగింపనెంచి తన దివ్యాస్త్రమును ప్రయోగించెను—

ఉ॥ చక్కదనంబు దీవియగు సాహిణిమారుఁడు మారుఁడై వడిన్
బొక్కిపడంగలండు చలమున్ బలమున్ గల యాచాళుక్యపుం
జొక్కనృపాలుఁ డుగ్రుడయి చూడ్కులమంటల రాలఁజూచినన్
మిక్కిలి రాజశేఖరుని మీఁదికివచ్చిన రిత్తపోవునే!

ఈ శాపముతో సాహిణిమారుఁడు యుద్ధమున చని పోవుటయు చాళుక్య చొక్కనృపాలునికి విజయము కలుగుటయు సిద్ధించెను.

కళింగపట్టణమునకు బూర్వపుపేరు శృంఖళద్వీపము. ఈ శృంఖళద్వీప నరేంద్రుడే రాజకళింగగంగని కొండుఱు

చెప్పుదురు. ఈ రాజకళింగగంగుతో భీమనకుగల సంబంధ మింతకుఁ బూర్వమే చెప్పబడినది. భీమకవి యొకనాఁడు శృంఖళ నరేశునియొద్ద కేఁగి 'నేను కవిని' అనెనట. ఆరాజు భీమకవి మహాత్మ్యముఁ దెలియక 'కావచ్చును! నీవు కవివై యేమిచేయగలవు? నీ పేరేమి?' అని ప్రశ్నించెను.

అందులకు భీమకవి యిట్లని సమాధాన మొసంగెను.

గడియలోపలఁ దాడినడఁగి ముత్తునియగాఁ
దిట్టిన మేధావిభట్టుకంటె
రెండుగడియల బ్రహ్మదండి ముండ్లన్నియుఁ
దుళ్ళఁదిట్టిన కవి మల్లుకంటె
మూఁడు గడియలకుఁ దా మొనసియ త్తిన గండి
పగులఁదిట్టిన కవిభానుకంటె
అఱజాములోపలఁ జెఱువునీళ్ళింకంగఁ
దిట్టిన బడబాగ్ని భట్టుకంటె

ఆ॥ వె॥ ఉగ్రకోపినేను నోపుదు శపియింపఁ
గ్రమ్మరింప శక్తి కలదు నాకు
వట్రిమానఁ జిగుఱు పుట్టింప గిట్టింప
బిరుదు వేములాడ భీమకవిని.

ఈ పై పద్యమువలన మనకు భీమకవివంటి యసాధారణ ప్రజ్ఞగలవారై యాతనికి సమకాలికులో, యించుక పూర్వులో యైన మఱికొందఱిపేర్లు తెలియుచున్నవి. అందు మేధావిభట్టు. ఈతఁడు సాళువ పెదతిమ్మరాజును దర్శింప

నేగెను. ఆతనిపైఁ బద్యము వ్రాయవలెనని బుద్ధిపుట్టగా నాతనివద్ద వ్రాయుటకుఁ దాటాకు లేకపోయెనట. వెంటనే, యాతఁడు సమీపమున గాన్పించిన తాటిచెట్టు నుద్దేశించి—

క॥ సాళువ పెదతిమ్మ మహీ
పాలవరుఁడువీడె వచ్చెఁ బద్యము వ్రాయన్
గేలను లేదాకొకటియు
దాళమ ముత్తునియలగుచు ధరపై బడుమా!

వెంటనే యాతాడిచెట్టు మూడుముక్కలై నేలగూలిన దట. కవి కార్యము నెఱవేరుటతోఁబాటు రాజునకు కవి యొక్క శక్తిసామర్థ్యములును వ్యక్తమైనవి.

ప్రౌఢకవి మల్లన గుడియన్నమరాజును దర్శింపవలె నని పయనమై పోవుచుండెను. కొండపల్లి పడమట నాతని మడమలలో బ్రహ్మదండిముండ్లు గ్రుచ్చుకొనెనట. ఆతఁ డుగ్రుఁడై యిట్లనెను—

గుడియన్న నృపతిఁబోడఁగన
నడువంగాఁ గొండపల్లినగరి పడమటన్
గుడిమెడమ మడమగాడిన
చెడు ముండులు బ్రహ్మదండిచెట్టునసుల్లున్.

ఈవిధమున బ్రహ్మదండిముండ్లు రాలిపోవునట్లుగా తిట్టి తన సామర్థ్యమును ప్రకటించెను.

బడబానలభట్టు వెలమవంశస్థుల గోత్ర ఖండ చేసిన వాఁడు. అందుచే వెలమవంశస్థు లీతని నెల్లప్పుడును స్మరించు

చుందురు. ఈ బడబానల భట్టొకసారి త్రిపురాంతకమునుండి శ్రీశైలమునకుఁ బోవుచుండెను. త్రోవలో నాతనికి తటాక మొకటి కనబడెను. ఆతటాకము తెనుఁగురాయఁడు కట్టించి నది. బడబానలభట్టు చెఱువులోదిగి స్నానమొనరించి సూర్యుని కర్ఘ్య మిడుచుండగా నాతని వ్రేలినున్న యుంగ రము జారి నీటిలోఁబడెను. ఎంత వెదకినను నది దొరక లేదు. అంత నాతఁడు కోపించి యిట్లనెను—

బడబానల భట్టారకు
కుడిచే యుంగరము రవికి గొబ్బున నర్ఘ్యం
బిడువేళ నూడి నీలోఁ
బడియెఁ దటాకంబు నీటఁబాయుము వేగన్.

వెంటనే తటాకములోని నీరింకిపోయినది. కవీశ్వరు నంగుళీయకము లభించినది. శాపము నుపసంహరించి యాతఁడు తనదారిని బోయెను. ప్రసంగవశమున దెల్పబడిన వీరంద ఱును భీమకవివలెనే శాపానుగ్రహ సమర్థులైన కవులు. భీమ నచే నుదహరింపఁబడినవారు.

భీమకవిని గుఱించి దేశమునఁ బ్రచారమున నున్నన్ని గాథలు మఱి యేయితర కవినిగుఱించియు లేవనుట యతిశ యోక్తి కాదు. ప్రతిగాథయు నాతని శక్తిసామర్థ్యములను బ్రకటించి యాంధ్రుల కుత్సాహ మొసంగజాలినదే! ఆంధ్రు లకు గర్వకారణమైనదే!

చామర్లకోటకు సమీపమున భీమవరమను గ్రామ మున్నది. పూర్వమది చాళుక్య భీముని ముఖ్యపట్టణమై

యుండెను. ఆకారణమున నది చళుక్య భీమవరమని ప్రసిద్ధి నందెను. శ్రీనాథుఁడు సైతమీ చళుక్య భీమవరమును యుదాహరించెను. భీమకవి యొకనాఁడా యూరికిఁ బోయెను. విశ్రమించుటకై యాతఁ డేయింటి కేఁగినను బసలభింపలేదు. మార్గాయాసమున నలసియున్న భీమకవికి కోపమువచ్చి యానగరము పాడువడునట్లు శపించెను. అట్లే యా నగరము పాడువడిపోయెను. పిమ్మట తరువాతివారా నగరమునకు దూరముగ నేటిభీమవరమును నిర్మించుకొనిరి.

ఈ కవీశ్వరుని కేమి కారణముననో కోమట్లపైఁ గోపము వచ్చెను.

చ॥ గొనకొని మర్త్యలోకమునఁ గోమటిపుట్టగఁబుట్టెఁ దోనబాం
కును గపటంబు లాలనయుఁ గుచ్ఛితబుద్ధియు రిత్తభక్తియున్
అనువరిమాటలున్ ఖరధనంబును గక్కుసమెక్కు జూచుటల్
కొనుటలు నమ్ముటల్ మిగులఁ గొంటుఁదనంబును మూర్ఖవాదమున్.

ఉ॥ కోమటి కొక్కుటిచ్చి పదిగొన్నను దోసము లేద; యింటికిన్
సేమమెఱింగి చిచ్చిడినఁ జెందద పాపము; వాసినెప్పుడే
నేమరుపాటునన్మఱియు నేమియొనర్చిన లేద దోసమా
భీముని లింగమాన! కవిభీముని పల్కులు నమ్మియుండుడీ!

ఉ॥ వేములవాఁడ భీమ! భళిరే! కవిశేఖర సార్వభౌమ! నీ
వేమని యానతిచ్చితివి యిమ్ములఁ గోమటి పక్షపాతివై
కోమటి కొక్కుటిచ్చి పదిగొన్నను దోసము లేదటంటివా?
కోమటి కొక్కుటీక పదిగొన్నను ధర్మము ధర్మపద్ధతిన్.

ఇట్టివే యీకవినిగూర్చిన గాధ లనేకములు మన యాంధ్ర దేశమునఁ బ్రచారముననున్నవి. ఇట్టిగాధలు, చాటువులే ప్రతిభాషాసాహిత్యమునకును అలంకారములు. సాహిత్య చరిత్రకు దర్పణములు. ఆభాషాకవుల కవితా వ్యాసంగమునకును, ఆభాష జనులయొక్క సాహిత్య సాంస్కృతిక ప్రతిభలకు నికషోపలములు. ఈ గాధలలోనే జాతి, సాహిత్యము, వారి బుద్ధిసంపద వ్యక్తమగుచుండును. ఏ జాతికిట్టి ప్రతిభా గాధ లనంతములుగా నుండునో యాజాతి సుసంపన్నమైనది- ఆభాష సుసంపుష్టమైనది. ఇట్టి ప్రాచీన మహత్త్వములేని భాష భాషకాదు—జాతి జాతికాదు. ఇట్టి గాధలు చదువునపుడు, వినునపుడు ఏజాతి హృదయము స్పందింపకుండును? ఆధునికు లీ కథ లసంబద్ధములనియు, నసంభవములనియు ద్రోసివేయుదురుగాక! కాని యీకవి ప్రతిభాగాధలలో నంతర్నిహితమైయున్న సత్యమును మాత్రము సహృదయులు కాదనజాలరు. ఈగాధ లతిశయోక్తులు కావచ్చును గాని యసత్యములు మాత్రముకావు. అతిశయోక్తి లలంకార శాస్త్ర సమ్మతము. అసత్యము ధర్మదూరము.

ఈ పై గాధలలో మనకుఁ గానవచ్చునది కవియొక్క యసాధారణమైన ప్రతిభావ్యుత్పత్తులు. వాటికి మెఱుగుపెట్టినది కవితా నైపుణ్యము. ఆ కవితా నైపుణికి వన్నెఁగూర్చిన వాతని యాత్మ విశ్వాస స్వాతంత్ర్యములు. కవిచే లోకము బంధింపఁబడుగాక లోకము కవిని బంధింపజాలదు. ఈకవియు లోకముచే బద్ధుఁడు కాలేదు. ఈతని గుణగణములకు భీమేశ్వర కృపాకటాక్ష వీక్షణముతోడై దైవాంశసంభూతు నొన

ర్చినది. ఇంతటి యుద్దండుడు, ఇంతటి మహత్త్వముగల కవి మఱియొకఁడు తెనుగుసాహిత్యముననే గాదు మఱియే సాహిత్యమునను నున్నట్లు కన్పట్టడు. ఈతనివాక్కు ఎంత పరుషమో హృదయమంత సుకోమలమైనది. అతిశయోక్తులతో గూడిన వనుకొన్నను పైగాథలనుండి మనము గ్రహింపగల కవి యొక్క వ్యక్తిత్వ మిదియే!

ఇట్టి యుద్దండుఁడు, ఇట్టి యాత్మవిశ్వాస స్వాతంత్ర్యములుగల దిట్ట, శంభువరప్రసాద కలితుఁడు కేవలమిట్టి చాటువులతో కాలము గడిపెనా? అట్లయినచో నాతని శక్తిసామర్థ్యములు వ్యర్థమైపోయినట్లే! కాక మహాకావ్య నిర్మాణ మొనర్చెనా? యను ప్రశ్న యుదయించుట సహజము. నాలుగైదు చాటుపద్యములనో లేక తిట్టుకవిత్వమో చెప్పి నంత మాత్రమున నెవ్వనిని మహాకవుల శ్రేణిలోఁ బరిగణింపరు. ముఖ్యముగ ప్రబంధ నిర్మాణ చణులైన కవులట్టి వారిని గుర్తింపరు, పూజింపరు. పూర్వకవు లనేకు లీ భీమకవిని, అతని శైలిని స్తుతించిరి.

'వయిచియింతు వేములవాడ భీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు' అని శ్రీనాథుడును,

నన్నయభట్టుఁ దిక్కకవినాచన సోముని భీమనార్యుఁబే
రెన్నికఁ జిమ్మపూడి యమరేశ్వరు భాస్కరు శంభుదాసునిన్
సన్నుతిచేసి వాక్యసరసత్వము వీనుల కింపుమీఱ న
త్యున్నతిగా నొనర్తు నెఱయోధులు మేలన కావ్య మిమ్ములన్

అని మల్లన్న తన రుక్మాంగద చరిత్రమునందు భీమ నను నన్నయ తిక్కనాది కవిశ్రేణిలో జేర్చి సన్నుతించి నాడు. కావున నాటికి భీమకవి మహాకావ్య నిర్మాతలలో నొకఁడై యున్నట్లు స్పష్టమగుచున్నది.

భీమకవి రచించినవని చెప్పఁబడుచున్న గ్రంథములివి.

(1) రాఘవ పాండవీయము (2) ఛందోగ్రంథము లేక కవిజనాశ్రయము (3) జ్యోతిషపటలములు (4) నృసింహ పురాణము (5) శతకంధర రామాయణము (6) బసవ పురాణము. పై గ్రంథములలో నే యొక్కటియును నేఁడుప లభ్యముగాక పోవుటచే నాతని కర్తృత్వమునుగూర్చి వాదోప వాదము లసంఖ్యాకములుగ బయలుదేరినవి. కాని యీత డీ గ్రంథములను రచించినట్లు ప్రాచీనకవు లుదాహరించి యున్నారు ఏదియోనొక ప్రౌఢకావ్యమును రచింపకున్నచో ప్రాచీను లాతని నంతగా స్తుతించి యుండరు.

భారతముఁ దెనిగించుచుఁ దా రచించి
నట్టి రాఘవపాండ వీయంబు నడఁచె
ఛందము నడంప నీఘక్క సంగ్రహించె
ననుచు భీమన యెంతయు నడఁచెదాని.

పై పద్యము అప్పకవి చెప్పినది. నన్నయభట్టు భారతమును రచించుచుండగా తాను రచించుచున్న రాఘవ పాండవీయము ప్రశస్తికెక్కదనియు, నన్నయ ఆంధ్రశబ్ద చింతామణి చేయుటవలన తన చందస్సు సైతము నాశన

మగుననియు భీమన భయపడెనట. ఆ భయముచే భీమన నన్నయ విరచితమైన ఆంధ్రశబ్ద చింతామణిని నాశనమొనర్చెనట. ఆ కవుల కాలమునుబట్టిగాని, వారి గ్రంథముల వైవిధ్యమునుబట్టిగాని, యాలోచించినచో నిది కేవల కల్పిత గాథయని తేలిపోవును.

జ్యోతిషపటలమున నాటికున్న వారియొక్కయు, చనిపోయినవారియొక్కయు, రాబోవు తరములవారి యొక్కయు సమస్తప్రశ్నలకు సమాధానములు కలవందురు. కాని గ్రంథమింతవరకు లభ్యముకాలేదు. శతకంధర రామాయణములోనివనియు, నృశింహ పురాణములోనివనియు, బసవపురాణములోనివనియు విమర్శకులు రెండు మూడు పద్యము లుదహరించుట తప్ప ఆ యా గ్రంథములు నేటికిని లభ్యముగాకున్నవి. ఏమైనను భీమన గొప్ప కావ్యమేదో నొకటి వ్రాసియుండకపోడనునది విశ్వసింపదగినవిషయము.

ఈ కవి కాలమును గుఱించియు ననేకములగు వాదోపవాదములు ప్రబలియున్నవి. కొందరు విమర్శకులు కవియెంతటి ప్రాచీనుడైన నాతనికంతటి ఘనతయబ్బునని కాబోలు నాతని ప్రాచీనత్వమును సిద్ధాంతీకరించుటకుఁ బడరానిపాట్లు పడుచున్నారు.

భీమకవి విషయమునగూడ నట్లే జరిగినది - జరుగుచున్నది. కొంద ఱీతనిని నన్నయకుఁ బూర్వుఁడనిరి. కొందరు నన్నయకు సమకాలీనుఁడనిరి. కొందఱీతని తిక్కన కాలమున నుఁ బ్రతిష్ఠించిరి. మఱికొందఱు పదునాల్గు పదునైదు [illegible]

ముల కీడ్చిరి. ఆతనిపైగల నాదరమునగాని, పక్షపాతమున గాని ఎవరెట్లు చెప్పినను ఈతడు పదునాల్గవ శతాబ్దికిఁ బూర్వుఁడు మాత్రము కానట్లు తోఁచును. కారణమేమన పదునాల్గవ శతాబ్దికిఁ బూర్వముననున్న వారెవరును నీతనిని పేర్కొనలేదు. ఈతనిని మొదట పేర్కొనినవాడు శ్రీనాథుఁడు. శ్రీనాథుని తరువాతి కవులును కొందఱీతనిని స్తుతించిరి. త్రికాలాబాధ్యులైన కవులకు కాలమునుబట్టి గౌరవము రాదుగదా!

ఆంధ్ర వాఙ్మయమున భీమన కవుల కారాధ్యుఁడు, ఆంధ్రులకు గౌరవనీయుఁడు. భీమనవంటి యుద్దండ కవిశిఖామణిని బొందిన ఆంధ్రసరస్వతి ధన్య. ఆతని చరిత్రమును వారసత్వముగాఁ బడసిన ఆంధ్రజాతి ధన్యము.

ఇట్టి మహాకవి నిర్యాయ మేరీతిని జరిగినదో చూడుడు. ఈతని తల్లి యొకనాడు బ్రాహ్మణ సమారాధనమున నేయి వడ్డించుచుండెను. నేతిచెంబు మసి యామె కడుపుమీఁద నంటుకొనెనట. అదిగాంచి భీమన 'అమ్మా! నీ కడుపు మసి యైన దనెన'ట! కడుపుమసి యగుట యనఁ గొడుకు చచ్చుట యని యర్థము. ఆమాట తగిలి యాతఁడా క్షణముననే మృతుఁడయ్యెనట! భగవల్లీలు విచిత్రములుగదా!

—♦♦—

అయ్యది క్రొల్పట్టణము. బ్రాహ్మణవీధి.. ఆ వీధిలో నొక మండువాయింటి ముందర నరుగుపై గూర్చుండి యున్నాఁడొక వృద్ధమూర్తి. సుమారు డెబ్బది సంవత్సరముల వయస్సు. ముదిమి మీఁదఁబడినను నింద్రియపటుత్వము తగ్గలేదు. తీర్చిదిద్దిన త్రిపుండ్రములు. మెడలో రుద్రాక్షమాల. చెవులకు గుండలములు, భుజముపైఁ గాశ్మీరుశాలువ. ముఖమున బ్రహ్మతేజస్సు. సాక్షాత్కరించిన పుంభావసరస్వతి. యౌవనమునఁ గరణికముఁ జేసి లౌక్యమును నెఱపి, రాజకీయములఁ బాల్గొని కావ్యరచన మొనర్చి, వార్ధకమున నన్నియుఁ విడచి భగవద్ధ్యానమునను, మనుమనికి విద్యాభ్యాస మొనర్చుటయందును గాలము గడుపుచున్నాడు – కమలనాభామాత్యుఁడు.

ఆతనియెదుట పదునైదేండ్ల బ్రహ్మచారి యొకఁడు కూర్చుండి వ్యాసపీఠిపై నైషధకావ్యముంచి పఠించుచున్నాఁడు. వృద్ధమూర్తి యాతనికిఁ బాఠము చెప్పుచున్నాఁడు. ఆ బ్రహ్మచారిలో నా వృద్ధుని పోలికలున్నవి. బహుశః మనుమఁడై యుండనోపును—నిజముగ మనుమఁడే! పితామహుఁడు చెప్పుచున్న ప్రత్యక్షరమును శ్రద్ధతో నాలకించుచు మనన మొనర్చుచున్నాడు. ఆతని బుద్ధి కుశాగ్ర

సదృశము. ఆతని పితామహుఁడును సామాన్యుఁడు కాడు. పద్మపురాణ సంగ్రహాది బహుకావ్య రచనాధురీణుఁడు. గురువునకుఁ దగిన శిష్యుఁడు. తాతకుఁదగిన మనుమడు.

కమలనాభునికి మనుమనిపైఁ బ్రేమ మిక్కుటము. తన పాండిత్యమును మనుమనియందు నిక్షేపింపవలెనని యాతని యుత్కంఠ. తనకుమారుని పండితు నొనర్పవలెనని యాతఁ డెంతయో ప్రయత్నించెనుగాని ఫలితము లేకపోయినది. ఆతఁడు పండిత పుత్రుఁడేయైనాడు. మనుమనినైనను తనంత వానినొనర్చి వంశగౌరవము నిలుపవలెనని తలచినాడు. ఆత నికి వేరొక పనిలేదు. కరణికమును కుమారుఁడైన మారయ కొప్పగించినాడు. ఇక మనుమఁడు— శ్రీనాథునితోడనే కాలక్షేపము.

శ్రీనాథునకు తాతవద్ద చనవెక్కువ. భయము తక్కువ. తాత మహాపండితుఁడన్న గౌరవ మధికము. తానంతవాఁడు కావలెనను మహత్వాకాంక్ష యధికము. తాతవద్దనే పంచ కావ్యములు పూర్తిచేసినాడు. పదునారేండ్లకే యలంకార శాస్త్రమును కరతలామలక మొనర్చుకొనినాడు. పితామ హుఁడు పాఠము చెప్పునపు డాతనియొద్ద గూర్చుండును. తక్కిన సమయములందు సముద్రతీరమునకేఁగి ప్రకృతి సౌందర్యమును దిలకించును. కంటబడిన వస్తువునెల్ల వర్ణించి పద్యములు వ్రాయును. వానిని తాతకు వినిపించును. తాత వానియందలి దోషములను దిద్ది యుత్సాహపఱచును.

పితామహుఁడొసంగుచున్న యుత్సాహముతో నాతని కాత్మవిశ్వాసము కలిగినది. ఒక కావ్యమునే వ్రాయ సంకల్పించెను. ఆలోచించి కథావస్తువు నెన్నుకొనినాఁడు. సంవత్సరములో మరుత్తరాట్చరిత్ర పూర్తియైనది. పితామహునకుఁ జదివి వినిపించినాఁడు. వృద్ధమూర్తి కనులవెంట నానందాశ్రువులు వెడలినవి. తా నాశించినట్లు మనుమఁడు పండితుఁడైనాఁడు. కావ్య నిర్మాణచణుఁడైనాఁడు. బహుకావ్య గ్రంథకర్తవు కమ్మని మనసులోనే దీవించినాఁడు. ఆకావ్యమందలి దోషములను సవరించి యుత్సాహపఱచినాఁడు.

శ్రీనాథుఁ డుత్సాహముతో నధ్యయనము సాగించెను. కావ్యరచనా వ్యాసంగమును సాగుచునే యుండెను. అతని కేమిలోటు? కావలసినంత యుత్సాహమున్నది. బ్రహ్మచారి. చీకుచింతలు లేవు. కొండంత తాత ప్రక్కనున్నాఁడు. శ్రీనాథుఁడు తర్కశాస్త్రమును సైతము పూర్తిగావించెను.

ఇంతలో నాతని జీవితమున కొక యాఘాతము తగిలినది. తన విద్యావ్యాసంగమున కాధారభూతుఁడైన పితామహుఁడు గతించినాఁడు. తండ్రియున్నాఁడు. ఆతనికిఁ దన కరణికపు లెక్కలఁదప్ప వేఱొకటి పట్టదు. శ్రీనాథునకు గృహ వాతావరము రుచింపలేదు. కొని రోజులట్లే గడచుచుండెను. కమలనాభుని మరణానంతరము పండితగౌరవ మీతనికే దక్కినది. గ్రామస్థు లీతనిని గౌరవించుచునే యుండిరి.

ఆ గ్రామమున వెలమకుటుంబము లెక్కువ. వారందఱును పలనాటివీరుల సంతతివారు. వారు తమ పూర్వుల

చరిత్రమును వ్రాయుఁడని శ్రీనాథు నర్థించిరి. కావ్య రచనోత్సాహముననున్న యువకుఁడు శ్రీనాథుఁడు వారి ప్రార్థనమును మన్నించినాఁడు. పలనాటి వీరుల చరిత్ర తా నిదివఱకు వినియున్నాఁడు. కథావస్తువునకై వెదుక నక్కఱలేదు. కాని, తన్నర్థించినది విద్వాంసులుకారు— పామరులు. మార్గ కవిత్వము వారిని రంజింపజేయుటకుఁ సమర్థముకాదు—గేయము వారి నెక్కుడుగ నాకర్షించును. కావుననే ద్విపదలో కావ్య నిర్మాణ మొనర్ప నిశ్చయించుకొనెను

పలనాటివీరచరిత్రము ద్విపదలో పూర్తియైనది. వెలమవీరు లాగాథను విని సంతోషాతిరేకమున కవిని ధనాదికములొసఁగి గౌరవించినారు. పామరులలో పలనాటి వీర చరిత్రము మిక్కిలి ప్రచారమందినది. దానితోబాటు శ్రీనాథుని పేరును వ్యాపింపజొచ్చినది. ఈ వీరగాథ యోరుగంటి పురమున కేఁగినది. అచట ప్రదర్శింపఁబడి మన్ననలందినది. క్రమముగ శ్రీనాథునిపేరు రాజాస్థానముల వఱకుఁ బ్రాకినది. పాండిత్యమున్నది. ప్రశస్తి లభించుచున్నది. కవి యింట గూర్చుండుటెట్లు? దేశాటన మొనర్పవలె. రాజాస్థానములందు మన్ననలందవలె. యశోధనముల సంపాదింపవలె. యువకుఁడైన కవియందీ వాంఛ గాఢమైనది.

ఇహలోకయాత్రకు ధనము ప్రధానము. కవులకు రాజదర్శనమునగాని ధనము ప్రాప్తింపదు. సామాన్యులు తలలూచువారేగాని కవులను దృష్టి లోనరింపఁజాలరు గదా! శ్రీనాథుఁ డాలోచించినాఁడు. ఇంటగెలిచి రచ్చ

గెలువవలె. ముందుసమీపముననున్న రాజాస్థానములను దర్శింపలెనని నిశ్చయించుకొనెను. తనకు సమీపముననున్న సంస్థానాధీశుఁడు పెదకోమటి వేమారెడ్డి. అప్పటికీ పెద వేమారెడ్డి రాజుకాలేదు. ఆతఁడు విద్యావంతుఁడు. కవిపండిత పరిశ్రమమును గుర్తింపజాలినవాడు. ఆతని మంత్రి మామిడి సింగన్న. శ్రీనాథుఁడీ సింగన్న కగ్రజుఁడైన ప్రెగడన్న నాశ్రయించెను. ఆతనితో స్నేహమొనర్చెను. ఎందులకు? రాజాస్థాన ప్రవేశమంత సులభసాధ్యముకాదు. గొప్పవారి ప్రాపున్ననేగాని రాజకటాక్షము లభ్యమయ్యేడిది కాదు. అందుచేతనే శ్రీనాథుఁడు ముందుగా నమాత్యాగ్రజు నాశ్రయించెను. పండితారాధ్య చరిత్రమును రచించి యాతని కంకిత మొసంగెను. అంతకుఁ బూర్వమే రచించి యుంచిన శాలివాహన సప్తశతినిగూడ ప్రెగడయ్య కంకిత మొసంగెను. ప్రెగడయ్యతో చెలిమి, చనవు నేర్పడినవి. జీవితము సాగిపోవుచున్నది. పాతికేండ్లు దాటినవి. ఇంతవఱకును చిల్లర దేవుళ్లతోడనే సరిపోవుచున్నదిగాని రాజసమ్మానము లభింపలేదు. రాజసమ్మానమేగాదు. అమాత్య సమ్మానము గూడ లభింపలేదు. మంత్రి భ్రాతవఱకే చేరగలిగినాఁడు.

ఇంతవఱకును గవితావ్యాసంగమున బాల్యము. వయసున బాల్యము. పెద్దలను సమీపించుటకు ధైర్యము చాలక పోయి యుండును. లేదా యౌవనారంభముననున్న యాతని కింకను ఆశ్రితుల కుండవలసిన చాకచక్యము, నేర్పు అబ్బి యుండకపోవచ్చును. ఏమైననేమి? శ్రీనాథుఁ డింకను

ప్రయోగదశలో ప్రయత్నస్థితిలోనే యున్నాఁడు. ఆతనికొక ప్రౌఢకావ్యమును రచింపవలెనను బుద్ధి కలిగినది. విద్వదౌషధ మనబఱగిన నైషధకావ్యగాధ యాతని మనసునకు నచ్చినది. దానికిఁ దగినట్లు పెదకోమటి వేమారెడ్డి వద్ద మంత్రిగానున్న మామిడి సింగన్న కవి నుద్దేశించి—

"బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడ వురు ప్రజ్ఞా విశేషోదయా
జిహ్మ స్వాంతుఁడ వీశ్వరార్చనకళాశీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళానిధానమవు నీ భాగ్యంబు సామాన్యమే!

జగము నుతింపఁగఁ జెప్పితి
ప్రెగడయ్యకు నా యనుంటు పెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ
మగు నా యారాధ్యచరిత మాదిగఁ బెక్కుల్
భట్ట హర్షుండు ప్రౌఢ వాక్పాటవమున
నెద్ది రచియించి బుధలోకహితముఁ బొందె
నట్టి నైషధ సత్కావ్య మాంధ్రభాష
ననఘ యొనరింపు నా పేర నంకితముగ"

నని ప్రార్థించినాఁడు.

శ్రీనాథుఁడు భాషాంతరీకరణ మెట్లుండవలెనో యాలోచించుకొనినాఁడు. సాధ్యమైనంతవఱకు మూలము ననుసరించియే యుండవలెనని నిశ్చయించుకొనెను. అశేష మనీషి హృదయంగమముగా నుండవలెననియు, భావంబుప.

లక్షించి, రసంబుఁ బోషించి, యలంకారంబు భూషించి, యౌచిత్యం బాదరించి, యనౌచిత్యంబును పరిహరించి మాతృకాను సారముగ కావ్యరచనము సాగవలెనని లక్షించెను. ఆ లక్ష్యమునే నెఱవేర్పసాగెను. సంస్కృత దీర్ఘ సమాసములతో రచనము సాగిపోయినది. మూలమునుజూచి నప్పుడాతనికిఁ దెనుగుపదములు, మాటవిరుపులు తోచెడివే కావు. భావావేశమున, మూలముపైగల నాదర భావమున నాతనికి సంస్కృతశ్లోక వాక్యములే సునాయాసముగ పద్యములై పోయినవి. సమాసమును విఱచుటయనిన నాతనికి కష్టముగ తోచెడిది. పండితులు మెచ్చుకొనవలెను. రసికులు భళీయనవలె. అది యాతని యుద్దేశ్యము. అందుచేతనే 'తపనీయ దండైక ధవళాతపత్రి తోద్దండ తేజః కీర్తి మండ లుండు' వంటి పాదము పాదమే సమాసమైపోయినది. అంతే కాదు, కందము, సీసము మున్నగు జాత్యుపజాతి ఛందములు గూడ నాతని సమాసములలో నిమిడిపోయినవి. శృంగారరస ప్రధానమైన నైషధ కావ్యరచనము పూర్తియైనది. శ్రీనాథుని కోరికతోఁబాటు కృతికర్తయైన మామిడి సింగన్న కోరిక గూడ సఫలమైనది. సర్వజన శ్లాఘాపాత్రముగ రచింపఁబడిన నైషధము సింగన్నకు సమర్పింపఁబడినది.

సింగన కవీశ్వరుని విశేషముగ సత్కరించినాఁడు. కాని శ్రీనాథుని కోరిక నెఱవేరలేదు. రాజసమ్మానమును బొంది యేదే నొక రాజాస్థానమున కుదురుకొనవలె నను వాంఛ గాఢముగ నుండెను. కాని యదృష్టము కలిసివచ్చుటలేదు.

రాజాస్థానమున నొక క్రొత్తవానికి స్థానము లభించుట సామాన్య విషయము కాదు. ఆరాజ్యములోనివాడై యుండవలె - లేదా ఆ యాస్థానములోనివారి సంతతివాడై యుండవలె - లేదా, యే యమాత్యునికో లేక యున్నతోద్యోగికో దగ్గఱిచుట్టమై యుండవలె. వీనియందే యొక్కటి లేకున్నను పూర్వమే పాదుకొనియున్న పండితులు రాజదర్శనము కలుగకుండుటకై విశ్వప్రయత్నము లొనర్చెడివారు. అట్టితఱి నిరాశతో వెడలిపోవుటకంటె క్రొత్తవానికి గత్యంతర ముండెడిదికాదు. తమకంటె ఘనుఁడని తోఁచినచో నా కవులు మఱింత జాగ్రత్తపడి సంక్షోభవించి యాతనిని వెడలగొట్టెడివారు. ఏకారణముచేతనైననేమి! పాపము శ్రీనాథునకు రాజాశ్రయము లభింపలేదు. రాజాశ్రయములేని కవిత శోభింపదనిగదా పెద్దలనుట! శ్రీనాథునకు వాఙ్మయక్షేత్రమునఁ బ్రసిద్ధి లభించినది కాని రాజపోషణములేక ప్రకాశించుటలేదు.

శ్రీనాథుఁడొకనాఁడేకాంతముగ తనలో దానిట్లు వితర్కించుకొనెను—'ముప్పది యేండ్లు పైఁబడినవి. పదునైదు సంవత్సరముల కావ్యరచనా వ్యాసంగము పూర్తియైనది. అనేక కావ్యములు రచించుట, కృతియొసంగుట జరిగినది. కాని నా వాంఛితార్థము సిద్ధింపలేదు. ఈ చిల్లర కృతిభర్తలే మొసంగగలరు! వారిచ్చినది కస్తూరికాది సుగంధ ద్రవ్యములకైనను చాలకున్నది. వచ్చిన ధనము వచ్చినట్లే పోవుచున్నది. ఈ సామాన్యులు నన్ను పోషింప

జాలరు. మహారాజుల యాశ్రయము లభింపకున్నది. ఏ ఒకటి రెండు పద్దెములో చెప్పి, యతుకులబొంతగా నొకకావ్యమును గూర్చిన కవు లనేకురు రాజసమ్మాన వైభవము లందు చున్నారు. ఇది రాజుల దోషముగాదు. వారి నాశ్రయించిన దుష్టగ్రహముల దోషము. ఆనాఁడు కొండవీటిలో నెంతపని జరిగినది! కుమారగిరి దర్శనమునకై నే జేసిన ప్రయత్నము లన్నియు వమ్మైనవి. తిప్పయసెట్టితో స్నేహమొనర్చితిని. ఆతని యాదరముఁ బొందితిని. కాని యాస్థానమంగలి కవులు నాకు ప్రవేశమే లభింపనీయలేదు. ఏమైనను కుమారగిరిరెడ్డి యాస్థానమునఁ జేరవలె. రాజనిన నాతఁడేరాజు. శృంగార ప్రియుఁడు, వైభవోల్లసితుఁడు. వసంతోత్సవాది సంతతో త్సవ క్రీడాపరాయణుఁడు. ఆతని యాస్థానమే నన్ను భరింప జాలినది. ఏమైనను మఱియొక ప్రయత్నముచేసి చూడవలె."

శ్రీనాథు డిట్లాలోచించి కొండవీటికిఁ బయన మయ్యెను. అచట కుమారగిరిరెడ్డి సుగంధ భాండాగారాధ్య క్షుఁడైన అవచి తిప్పయసెట్టి పూర్వస్నేహితుఁడు. అతఁడు ప్రధాన రాజకీయోద్యోగి యగుటతో బాటు గొప్ప వ్యాపార స్తుఁడు. కోటీశ్వరుఁడు. కుమారగిరి కాప్తుఁడు. కాన నీతని ద్వారా, రాజాశ్రయమును సంపాదింపవచ్చును. కానిచో కోటీశ్వరుఁడును, పూర్వపరిచితుఁడును, తనవలెనే శివభక్తుఁ డునునైన తిప్పయసెట్టివలనఁ బ్రయోజన ముండకపోదు. ఇట్లాలోచించి శ్రీనాథుఁడు కొండవీటికిఁ బోయెను. తా నాశించినట్లే తిప్పయసెట్టి యాతనిని గౌరవించి యాద రించెను.

కుమారగిరిరెడ్డి విద్వాంసుఁడే. కాని ప్రజాపాలనమునకంటె నాతనికి వసంతోత్సవాది వినోదములందు మక్కువయెక్కువ. ఆతఁడు రాజ్యనిర్వహణ భారమంతయుఁ దనమేనత్త కుమారుఁడైన కాటయవేమారెడ్డి యందుంచి తాను నిర్విచారుఁడై, బాధ్యతారహితుఁడై వినోదములఁ దవిలియుండెను. ఈ ద్వంద్వ ప్రభుత్వమున శ్రీనాథునికి పరిస్థితు లంతగా నను కూలింపలేదు. అతఁడు నిరుత్సాహముఁ బొందలేదు. తరుణమునకై వేచియుండెను.

కాని యూరక కూర్చుండు టాతనికిఁ గష్టముగానే యుండెను. అతని స్వభావమేవేఱు. అతనిదే కాదు. కవి స్వభావమే యట్టిది. భోగముండవలె. మనసునకు, లేఖినికి పనియుండవలె. మొదటిది లోపించినచో నాతఁడిక చేయునదే లేదు. ఒకనాఁడు తిప్పయసెట్టి శ్రీనాథుని వీక్షించి యిట్లనినాఁడు—

కంటిని విశుద్ధ సంతతి
వింటిఁ బురాణములు పెక్కు విశ్వము పొగడన్
మంటి బహువత్సరంబులు
గొంటి యశోధనము సుకవికోటి నుతింపగన్.

ఆగమజ్ఞాన నిధివి తత్త్వార్థఖనివి
బహుపురాణజ్ఞుఁడవు శుభభవ్యమతివి
బాలసఖుఁడవు శైవప్రబంధ మొకటి
యవధరింపుము నాపేర నంకితముగ.

ఇట్లు ప్రార్థించి కస్తూరీఘనసార చందనాంబర సహితముగ తాంబూల మొసఁగినాఁడు. ధనవంతుఁడు. రాజసమ్మానపాత్రుఁడు, ప్రతిష్ఠితుఁడు, పూర్వస్నేహితుఁడు, ప్రస్తుతము పోషకుఁడు, శివభక్తుఁడు, వయసు చెల్లినవాఁడునునైన తిప్పయ సెట్టి మాటను త్రోసివేయుటెట్లు? శైవప్రబంధమును కోరినాడు. తానును శివభక్తుఁడే! తీర్థమును స్వార్థమును కలసి వచ్చును. ప్రబంధోచితమైన శైవగాథ యేది? యేది తిప్పయసెట్టికిఁ బ్రియముఁ గూర్చును? శైలి యెట్లుండవలె? శ్రీనాథుఁడాలోచించినాఁడు.

"కృతిభర్త కాఁగోరినవాఁడు శైవభక్తుఁడు. కోరినది శైవప్రబంధము! కృతిభర్త కోమటి. కృష్ణలీలలను భాగవతమున వర్ణించునట్లుశివలీలలను వర్ణించు ప్రబంధమునరచించుట యుక్తము. ఆ లీలలలో కోమటి భక్తుఁడైన చిఱుతొండనంబి కథ యుండవలె. గ్రంథాదిని కృతిపతి వంశవర్ణనాదికము లతి రంజితముఁగా నుండవలె. నైషధకావ్యశైలి నారికేళపాకమనియు, దీర్ఘసంస్కృత సమాస భూయిష్ఠమనియు, మాతృకయందలి సమాసములే యథాతథముగ నున్నవనియుఁ బెక్కుమంది విమర్శించుచున్నారు. నాతి కఠినపదములతో, జాతీయములతో హృదయంగమమైన పద్ధతిలో నీ రచన సాగవలె. హరవిలాసమను నామము గ్రంథమున కెంతయుఁ దగియుండును."

ఈ నిర్ణయము లొనరించుకొని శ్రీనాథుఁడు హరవిలాస రచనమునకుఁ గడంగెను. శివలీలావిలాసములలో మొదట చిరుతొండనంబిచరితమును గ్రహించినాఁడు.

వీరశైవ శిఖామణియైన చిరుతొండనంబి యను వైశ్యుఁడు గలఁడు. అతఁడు నిత్యము దన పంక్తిని జంగమ ప్రమధులులేక భుజించెడివాఁడు కాఁడు. ఒకసారి యిరువది రెండు దినము లెడ తెరపిలేని వర్షములు గురిసెను. కాంచీ నగర మంతయు నీటిలో మునిగియుండెను. మనుష్యసంచారమే లేకుండెను. నంబికిఁ దన ప్రక్కనగూర్చుండి భుజించుటకు జంగమహేశ్వరుఁ డొక్కఁడును గాన్పింపలేదు. వ్రత భంగమగునేమోయని చింతించుచు నాతఁడు శివభక్తుల కొఱకు కాంచీనగరమున నన్వేషింపసాగెను. చివఱ కూరి బైటనున్న యొక దేవాలయములో వృద్ధశైవ దంపతులు గాన్పించిరి. చిరుతొండనంబి వారిని సమీపించి తన వ్రతముఁ దెల్పి భోజనమున కాహ్వానించెను. అంతట వృద్ధుఁ డాతనితో — 'ఓయీ! నీ వ్రతముఁ దెల్పితివి. నాకొక వ్రతమున్నది. వినుము. క్రొత్తగా నుపనీతుఁడై పదియేండ్లు వయసుగల కుమారుని తల్లియే స్వయముగా జంపి వండి వడ్డింపవలె. ఇది నా వ్రత నియమము. అందుల కీయకొందు వేని వత్తు'నని నెను.

చిరుతొండనంబి యేమాత్రమును శంకింపక సమ్మతించెను. ఇంటికేఁగి భార్యతోఁ జెప్పెను. పాఠశాలలోనున్న కుమారుని సిరియాళుని గొనివచ్చి యుపనీతుఁ జేసిరి. ఆబాలుఁడును జంగమమాహేశ్వరుని కాహారమగుట కంగీకరించెను. తల్లియైన తిరువెంగనాంచియే యాబాలునిఁ దఱిగి వంశీ యతిథికి వడ్డించినది. అప్పుడా జంగమ మాహేశ్వరుఁడు—

'ఓయీ! నీ కుమారు నొకనిగూడ పంక్తికిఁ బిలువుము. అపుత్రకునియింట నేను భుజింప'ననెను.

అందుల కాతఁడు—'స్వామీ! నే నేకపుత్రకుఁడను. మీ వ్రతము నెఱవేర్చుటకై యాతనిని వండి వడ్డించితిమి. ఇప్పుడెట్లు కుమారుని పిలువగలను?' అనెను.

అప్పుడాయతిథి— 'అట్లయిన నా బాలునే తల్లిచేత పిలిపింపుము' అనెను.

తిరువేంగనాంచి యతిథికోరిక నెఱవేర్చుటకై 'సిరియాలా! సిరియాలా!'యని కేకవేసెను.

మహాశ్చర్యము! సిరియాలు డెప్పటియట్లు పరుగెత్తుకొని వచ్చెను. తమభక్తిని పరీక్షించుటకై పార్వతీ పరమేశ్వరులే వృద్ధరూపమున నవతరించిరని యా వైశ్యదంపతులు గ్రహించిరి. సవినయముగ సాష్టాంగ మెఱగిరి. వారిభక్తికి మెచ్చి యా యాదిదంపతులు వారినేగాక కంచి యేడు వాడలలోనున్న వైశ్యు లందఱకును కైలాస నివాస మను గ్రహించెను.

రచనము గంగాప్రవాహముగ సాగిపోవుచున్నది. శైవుఁడు వైశ్యుఁడునైన కృతిభర్త తిప్పయసెట్టి యానందోత్సాహమున నోలలాడినాడు. ఇట్టి శివలీలా విలాసగాథలతో నేడాశ్వాసముల కావ్యము సంపూర్ణమైనది. శ్రీనాథుఁడద్దానిని తిప్పయసెట్టి కంకిత మొసంగెను. తిప్పయసెట్టియుఁ దన జన్మ తరించినట్లు తలపోసినాఁడు— 'మహాకవి విరచితమైన శైవప్రబంధమునకు గృతిభర్తనైతిని. ధనమున్నందుకు

ఫలము నేడు లభించినది. ధనముతో శాశ్వతకీర్తిని సంపాదించు కొంటిని. పరమమాహేశ్వరుఁడును, మాకు మూలపురుషుఁడును, వైశ్యుల కారాధ్యుఁడునునైన చిరుతొండనంబి చరితమును రచించుటకుఁ గారణభూతుఁడనైతిని చిరుతొండని బంధువులందఱికిని కైలాసనివాసప్రాప్తి కలిగించిన మహేశ్వరుఁడాతని చరితమునకు గృతిభర్తనైన నన్నుమాత్ర మనుగ్రహింపకుండునా? అహో! ధన్యుఁడను. నేటివఱకు ధనము సంపాదించుటయే నేర్చితిని. నే డది ఖర్చుచేయదగిన పద్ధతిని సైతము కనుగొంటిని. నా జన్మము ధన్యమైనది.'

అశేష ధనరాసు లొసఁగి తిప్పయసెట్టి శ్రీనాథుని గౌరవించినాఁడు. శ్రీనాథునికి ధనము లభించినది. కోటీశ్వరునిప్రాపు లభించినది. కాని రాజాశ్రయ మింకను లభింపలేదు. మహాభోగియైన శ్రీనాథునికి వీరిచ్చు ధనము చాలునా? శ్రీనాథుని జీవనము సామాన్యముకాదు. ఒక్కమాటలో జెప్పవలెనన్న భూమిపై లభింపఁగల భోగములన్నియు నాతఁ డనుభవింపవలసినవే! కవిచక్రవర్తి యాతఁడు. చక్రవర్తి భోగములన్నియు నాతనికిని గావలసినవే!

కాలము గడచిపోవుచున్నది. హరవిలాసమును రచించిన కొలదికాలముననే కుమారగిరిరెడ్డి పరలోకగతుఁడైనాఁడు. ఆతని తరువాత పెదకోమటి వేమభూపాలుఁడు కొండవీటికి ప్రభువయ్యెను. పెదకోమటి వేమునితోఁ బాటాతని మంత్రియు, నిదివఱలో శ్రీనాథవిరచితమైన నైషధమునకు, గృతిభర్తయైన మామిడి సింగన్నగూడ కొండవీఁ

చేరెను. పిమ్మట కొంతకాలమునకు సింగనామాత్యుని యను గ్రహమున శ్రీనాథునికి రాజాస్థాన ప్రవేశము లభ్య మయ్యెను. ఆతని చిరకాల వాంఛితము నెఱవేరెను. వేమ నృపాలుని యాస్థానమున నాతఁడు విద్యాధికారిగా నియ మింపఁబడెను. రాజాస్థానమునకు కేతెంచు కవిపండితులఁ బరీక్షించి పారితోషికములను నిర్ణయించు టాతని పనియైనది. వేమభూపాలుఁడు సంస్కృతాంధ్రములయందు మంచి పాండి త్యము గలవాఁడు. శ్రీనాథుఁడాతని యాస్థానమున నాంధ్ర కవి; వామనభట్టు సంస్కృతకవి. వీ రిరువురిపైనను వేమా రెడ్డికి విశేషగౌరవముండెను.

కాలముతోబాటు శ్రీనాథుని జీవితమునగూడ మార్పువచ్చినది. కొండలపైనుండి దుముకుచు, సుడులు తిరుగుచు ప్రవహించిన జీవనస్రోతస్విని సమభూమికి జేరినది. మైదానమున నిండు చూలాలివలె మందగమనమునఁ బ్రవ హించు నదివలె నాతని జీవితము ప్రశాంతముగ సాగిపోవు చుండెను. ధనమునకా లోటులేదు. రాజగౌరవమునకుఁ లోటులేదు. విద్యాధికార పదవి శ్రీనాథుని కొక విధమైన ఠీవిని, ప్రతిష్ఠను గూర్చినది. కావ్యరచనా వ్యాసంగము కొంచెము మందగించినది.

ఉదయము రాజసభ కేఁగవలె. దూరదేశాగతులైన పండితులను పరీక్షింపవలె. సాహిత్య చర్చలలో బాల్గొని యుద్యోగ విధులను నిర్వర్తింపవలెను. శాసనాదికములు రచింప వలెను. మధ్యాహ్న భోజనానంతర మించుక విశ్రాంతి.

మజల సాయంకాలము రాజసభకు బోవు సన్నాహములు. రాత్రి భోజనమైనంతనే రాజసందర్శనార్థమే తెంచి, ముందుగ నాతని దర్శనము నపేక్షించి వచ్చిన పండితులతోడి ప్రసంగములు, మిత్రులతో సభాప్రసంగములు. కాలమీరీతిని గడచి పోవుచున్నది.

దీనికిఁ దగినట్లు వేమభూపాలుఁడు శ్రీనాథుఁడు తన యాస్థానమున నుండుటయే చాలుననుకొనెను. ఆతని గ్రంథ రచనమున కైతొందఱ చేయలేదు. అసలాతనికిఁ గృతిభర్తను కావలెనన్న వాంఛ తక్కువ. కృతికర్తను గావలెనన్న కోరిక మెండు. అమరుకమునకు వ్యాఖ్యానము వ్రాసి తన పాండిత్యమును జూపవలెనని యాతని కోరిక. అందుచే శ్రీనాథ వామన భట్టులతో నాతఁడెల్లప్పుడును అమరకమునుగూర్చియే చర్చించునుగాని వారిని కావ్యరచనమునకుఁ బ్రబోధింపడు. వేమారెడ్డి శృంగారదీపిక యనుపేర నమరుక కావ్యమునకు వ్యాఖ్య వ్రాయుట ప్రారంభించెను. శ్రీనాథ వామనభట్టులు సంశోధకులై సాయపడుచుండిరి. అచ్చటచట శ్రీనాథుఁడు తాను వ్రాసిన శ్లోకములనే యందులోఁ జేర్చెను. అమరుకవ్యాఖ్య పూర్తియైనది. వేమారెడ్డి వైద్యశిఖామణి విద్వాంసుఁడైన సంగనార్యునకు పొన్నుపల్లిని దానము చేయుచు నందు దక్షిణభాగమును శ్రీనాథుని కిచ్చెను.

పెదకోమటి వేమారెడ్డి చనిపోయిన పిమ్మట నాతని కుమారుఁడు రాచవేమన రాజ్యమునకు వచ్చెను. ఆకాలమున గూడ శ్రీనాథుఁడు విద్యాధికారి పదవిని నిర్వహించెను.

కొండవీటి యాస్థానమున జేరి పదునైదు వత్సరములకు పైగా గడచిపోయినవి. ఇంతవఱకును శ్రీనాథుని రచనములు బయటపడలేదు. ఆతఁడు శివరాత్రి మహాత్మ్యమును ప్రారంభించెను. దానిని రచించి పెదకోమటి వేమారెడ్డి కంకితమీయ సంకల్పించెను. కాని రాజకార్యములవలన రచనము శీఘ్రముగ పూర్తి కాలేదు. ఈలోగా వేమారెడ్డి మరణించెను. అటుపిమ్మట కొండవీటి రాజ్యము కర్ణాట ప్రభువులకు లోబఁడి పోయినది. శివరాత్రి మహాత్మ్యము పూర్తియైనది. కాని ప్రభువు చనిపోయెను. రాజ్య మన్యాక్రాంతమాయెను. శ్రీనాథుఁడు మఱల ఆశ్రయ హీనుఁడయ్యెను. రెడ్డిరాజుల యాస్థానమునను, నితరులవలనను నాతఁడు సంపాదించిన ధనమునకు మితిలేదు. కాని యాతని చేతియం దెన్నడును చిల్లిగవ్వయును నిలువదు. ఆతఁడు వార్ధక్యమున నుపయోగపడునని గాని, రాజాశ్రయము లేనపు డుపయోగ పడునని గాని ధనసంగ్రహమునకై పాటుపడలేదు. తానెట్లు సంపాదించెనో యట్లే తా నితరులకును దాన ధర్మములు చేసినాడు. శృంగారప్రియుఁడు, రసికుఁడునై నకతమున విచ్చలవిడిగ ధనమును వ్యయించినాడు. రాజు చనిపోయినాడు. సింగనామాత్యుడు దివికేగినాడు. రాజాశ్రయము పోయినది. వెనుకటి శ్రీనాథుఁడు మాత్రమే మిగిలినాఁడు.

రాజ్య మన్యాక్రాంతమగుటతో కవి కొండవీటిని వీడవలసి వచ్చెను. ఎచటికి పోవుట? యను ప్రశ్న ముదయించినది. ముందు శ్రీశైలయాత్రచేసి పిమ్మట కర్తవ్య

మును నిర్ణయింతమనుకొని శ్రీశైలమునకుఁ బయనమయ్యెను. శ్రీశైలము శైవక్షేత్రము. ఇష్టదైవతములైన భ్రమరాంబా మల్లికార్జునుల దర్శన మొనరించుకొనినాఁడు— మహాశివ రాత్రి పుణ్యదినమున. పిమ్మట మఠాధిపతులైన జంగమగురు పీఠము వారి దర్శనము చేసినాడు. పీఠాధిపతులు లక్షాధి కారులు. వారి యనుగ్రహమునకుఁ బాత్రుఁడైనాఁడు.

ఒకనాడు శ్రీశైల స్వయంభూ శ్రీలింగ చక్రవర్తి శ్రీమన్మల్లికార్జున శ్రీ మహాదేవుని ముఖమండపమున నాసీనులై యుండి శివకథా విధానములఁ బ్రబోధ్ధుపుచ్చుచుండిన శ్రీ శాంతభిక్షావృత్తి యతీశ్వరుఁడు శ్రీనాథుని శివరాత్రి మహాత్మ్యములను విని తన మూలభృత్యుండైన ముమ్మడి శాంతయ్యకుఁ గృతి యొసంగుమని కోరెను. శ్రీనాథుఁడా కోరికను మన్నించి స్కాంధపురాణ మాధారముగ రచించి యుంచిన శివరాత్రి మహాత్మ్యమునఁ గృతిపతి వంశవర్ణనాది కములఁ జేర్చి శాంతయ్యకుఁ గృతియొసంగెను. దీనివలనఁ దీర్థము స్వార్థము కలసివచ్చినవి.

ఇఁకే కర్తవ్యము నాలోచింప దొడగినాడు శ్రీనాథుఁడు. కొండవీటికిఁ బోవుటయా? దానివలనఁ బ్రయోజనము లేదు. రాజమహేంద్రవరము పోదమన్న నచటి రెడ్డిరాజులు తన్నుపోషించిన పెదకోమటి వేమునివలన గష్టములపాలైన శత్రుపక్షములవారు. వారెట్లీతని కాశ్రయ మొసంగగలరు? కాగా మిగిలియున్న రాజ్యము కర్ణాటరాజ్యము. ఆ కాలమం దలి గొప్పరాజ్యమది. ఆ విద్యానగర సామ్రాజ్యమును

ప్రౌఢ దేవరాయలు పాలించుచుండెను. ఏమైనను శ్రీనాథుఁడచటికేగ నిశ్చయించుకొనెను.

శ్రీనాథుఁడు విద్యానగరముజేరి కొన్ని నెలలైనది. రాజదర్శనమునకుఁ బ్రయత్నములు సేయుచునేయున్నాఁడు. పూటకూటి యిండ్లలో భుజించుచుఁ రాజకీయోద్యోగుల నాశ్రయించుచుఁ తదుచిత వేషభాషలతోఁ దిరుగు చుండెను. కాని రాజదర్శనముమాత్రము కాలేదు. విసిగిపోయి యిట్లనినాఁడు—

"కుళ్ళాయుంచితిఁ గోకచుట్టితి మహా కూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్తవడ్డింపగాఁ
జిల్లా యంబలి ద్రావితిన్ రుచులుగోసంబంచుఁ బోనాడితిన్
దల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా? నేను శ్రీనాథుడన్.

పాపము శ్రీనాథుఁ డిట్లెన్నో వ్యయప్రయాసల కోర్చిన పిమ్మట రాజదర్శనభాగ్యము లభించినది. ప్రౌఢ దేవరాయలు కవినిగూర్చిన పరిచయ మడిగినంతనే శ్రీనాథుఁడు——

పరరాజ్య పరదుర్గ పరవైభవశ్రీలఁ
గొనకొని విడనాడు కొండవీడు
పరిపంథిరాజన్యబలముల బంధించు
కొమరుమించిన బోడు కొండవీడు
ముగురురాజులకును మోహంబు పుట్టించు
గుఱుతైన యుఱ్ఱ్రెతాడు కొండవీడు
చటుల విక్రమకళా సాహసంబొనరించు
కుటిలాత్ములకుఁగాడు కొండవీడు

జవనఘోటక సామంత సరసవీర
భటనటానేక హాటక ప్రకట గంధ
సింధురారావ మోహనశ్రీలఁ దనరు
కూర్మి సమరావతికిఁ జోడు కొండవీడు

అని చెప్పినాఁడు. ఎట్లయిననేమి వల్లభరాయని యను గ్రహమున రాజదర్శనభాగ్యము లభించినది. ఇక రాజు నలరించి సమ్మానమును బొందుట మాత్రమే మిగిలియున్నది. ప్రౌఢదేవరాయల యాస్థానమున గౌడడిండిమభట్టను పండితుఁ డుండెను. ఆతఁడు మిక్కిలి యుద్దండుఁడు. ఆతనికి కవిసార్వ భౌమ బిరుదముండెను. తన్ను వాదమున నోడించినవానికిఁ దన కవిసార్వభౌమ బిరుదమిచ్చివేసి తన విజయడిండిమమును బ్రద్దలుకొట్టింతునని ప్రతిజ్ఞజేసి యుండెను. సామాన్య కవు లందఱు నాతని జోలికిఁబోక తృణమో పణమో రాజిచ్చినది తీసికొని వెడలిపోవుచుండిరి. శ్రీవాణీప్రసాదలబ్ధ సకలవిద్యా సనాథుఁడు శ్రీనాథుఁడుసామాన్యులవలె నెట్లుమగిడిపోగలఁడు? డిండిమభట్టులో వాదమునకు సిద్ధపడినాఁడు. ఆకవి సింహము లకు, పండితగ్రామణులకుఁ గొన్నిదినములా వాదము జరిగినది. శ్రీనాథునకు చంద్రశేఖరుఁడను కవిపండితుఁ డొకఁడు సాయమై యుండెను. విజయము శ్రీనాథునే వరించినది. గౌడడిండిమభట్టు కంచుఢక్కను బ్రద్దలుకొట్టించినాఁడు. కవిసార్వభౌమ బిరుదమును బొందినాడు.

సహృదయుఁడైన ప్రౌఢదేవరాయలు తన యాస్థాన విద్వాంసుఁడు పరాజయమందినందులకుఁ గినియలేదు. శ్రీనాథ

సుకవిరాజమాళికి దీనారావములతో సువర్ణస్నాన మొనరించి మిక్కిలి సమ్మానించెను. రాయల యాస్థానమునఁ గీర్తితోఁ బాటు శ్రీనాథునకు బహుధన కనకసంచయములు లభించినవి.

శ్రీనాథుఁడు రాయల యాస్థానమున స్థిరవాసమును గోరలేదు. అచటినుండి బయలుదేరినాఁడు. దేశసంచారము చేయసాగెను. ఈ సంచారములో నాతఁ డాంధ్రవల్లభుని దర్శించినాఁడు. ఈ తెలుఁగురాయఁడు కవిజనప్రియుఁడు. రసికుడు. కవులకు కస్తూరి దానముజేయుటలో ఘనుఁడు. శ్రీనాథునికిక గావలసినదేమున్నది? అతనిఁగాంచియనినాఁడు—

అక్షయ్యంబగు సాంపరాయని తెనుంగాధీశ కస్తూరికా
భిక్షా దానముచేయురా సుకవిరాడ్బృందారక స్వామికిన్
ద్రాక్షారామపురీ విహార వరగంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించు తద్వాసనల్

తానచటినుండి ద్రాక్షారామము పోవనున్నట్లు సూచించి కస్తూరికాదానముఁ గోరినాఁడు. తెలుఁగురాయ డాతనిని యథార్హముగ సంభావించినాఁడు. శ్రీనాథుఁడు త్రోవలో మైలారురెడ్డిని దర్శించి యటనుండి రాచకొండ చేరినాఁడు.

రాచకొండ సంస్థానాధీశుఁడు సర్వజ్ఞసింగమనాయకుఁడు. సామన్య సంస్థానాధిపతియేయైనను నాతఁడు గొప్ప విద్యాంసుఁడు. సర్వజ్ఞబిరుదాంకితుఁడు. కవిపండిత పోషకుఁడు. కృతికర్త, కృతిభర్తయునై వాసిగాంచినవాఁడు. శ్రీనాథుఁ డట్టివాని దర్శనమున కేఁగినాఁడు.

ఆ సభయే విచిత్రముగ నుండెను ఉన్నతమైన వేదికపై శారదావిగ్రహము. ఆ దేవికి ముందుభాగమున నెత్తుగ చిరుగాలికి రెపరెపలాడుచున్న శారదా ధ్వజము. వ్యాస, కాళిదాస, భవభూతి, నన్నయ, తిక్కనాది కవివరేణ్యుల చిత్రపటములు కుడ్యములపై వ్రేలాడుచుండెను. ఆ పటముల క్రిందిభాగమున వారి రచనలనుండి యుత్కృష్టములైన పద్యము లుదహరింపబడి యుండెను. సభాసదుల కెదురుగ కుడ్యములపై కవితా నియమములను, వాదోపవాదనియమములును లిఖింపఁబడియుండెను.

అచటి కవితానియమముల ననుసరించి వాచ్యముగ నాత్మస్తుతి పనికిరాదు. పరనింద వలనుపడదు. కవి దైన్యముతో మాటాడరాదు. శ్రీనాథుఁడు సభలోనికేఁగి శారదా మూర్తిని స్తుతించినాడు—

దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకుతోడై తాంధ్రభాషా మహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునకుఁ
బగులఁగొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడ డిండిమభట్టు కంచుఢక్క—
చంద్రశేఖరు క్రియాశక్తి రాయలయొద్ద
బాదుకొల్పితి సార్వభౌమ బిరుద
మెటుల మెప్పింతువో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు

నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరస సద్గుణనికురంబ శారదాంబ.

ఈ పద్యము వినినంతనే సింగభూపాలునికి మహానం దము గలిగినది. కవి సామాన్యుఁడుకాడని తెలిసికొని వాచ్యముగ చెప్పకయే తన్నుగూర్చిన పరిచయమిచ్చి పండితజన సమాదరణమునఁ బేరుగాంచిన సర్వజ్ఞుఁ నన్మానసంభావనల దృప్తునొనరించి కొంతకాలము తన ఆస్థా నమున నుంచుకొనినాఁడు. చిరకాల మొక్కచోట నుండుట శ్రీనాథుని కిష్టముకాదు. దేశసంచారము, భిన్నరాజ సందర్శనము, రాజసమ్మానములు నపేక్షించి మఱలబయలు దేరెను. ఆంధ్ర దేశముననుండిన సంస్థానములన్నియుఁ దిరిగినాఁడు. పొందవలసిన గౌరవములన్నియుఁ బొందినాడు. అనుభవింపదగిన భోగము లనుభవించినాడు. ముదిమి మీదబడుచున్నను ధనసంగ్రహమునకు మాత్రము ప్రయత్నింపలేదు. అందుచే నెచటనైనను స్థిరనివాసమేర్పరచుకొనవలెనని సంకల్పించెను. సామాన్య సంస్థానాధిపతులు, మండలేశ్వరులు, కవిసార్వభౌముని పోషింపఁజాలరుకదా! మహారాజులు కావలె. ఇఁకమిగిలియున్నది రాజమహేంద్రవరమున రెడ్డిరాజ్యము.

రాజమహేంద్రపురమున నల్లాడరెడ్డి పుత్రులు ప్రభువులైరి. తరువాత నాటినుండియుఁ దన కుటుంబముతోఁ బరిచయము, మిత్రత్వముఁగల బెండపూడి యన్నయమంత్రి వారికి మంత్రిగానుండెను. శ్రీనాథుఁడు అన్నామాత్యు నాశ్రయించినాఁడు. ఆతనికి భీమేశ్వర పురాణము రచించి యాంకిత

మొనర్పనెంచెను. గ్రంథరచనమున నాలస్యముగుటకు వీలు లేదు. శీఘ్రముగ ముగించి యన్నమంత్రిని కృతిభర్త నొనరించి కృతిభర్తతోబాటాతని ప్రభువులైన రాజులను సైతము యథేచ్ఛముగ స్తుతించినాడు.

ఇది యిట్లుండ రాజమహేంద్రవరమునందలి పండితు లెవ్వరో శ్రీనాథుని కవిత్వము సంస్కృతశబ్ద మయమనియు, తెనుగు ప్రత్యయములుతప్ప తెనుగుభాషా పదములే యుండ వనియు, ఆతనిది కర్ణాట భాషాసంప్రదాయమనియు నిందింప సాగిరి. శ్రీనాథునిముందు తమ గొప్పదనము ప్రకాశింప కుండుటే యందులకుఁ గారణము. ఆకారణముననే నాటి పండితుల నుద్దేశించి శ్రీనాథుడు భీమఖండమున నిట్లనెను—

సీ॥ బోధమల్పంబు గర్వమభ్యున్నతంబు
శాంతినిష్పచ్చరంబు మచ్చరము ఘనము
కూపమండూకములఁబోలెఁ గొంచెమెఱిఁగి
పండితమ్మన్యులైన వైతండికులకు.

సీ॥ నికటముననుండి శ్రుతిపుట నిష్ఠురముగ
నడరి కాకులు బిట్టు పెద్దఱచినప్పు
డుదధిరాయంచ యూరకయుంటలెస్స
సైపరాకున్న నెందేని జనుటలెస్స.

గీ. ప్రౌఢిఁబరికింప సంస్కృతభాషయండ్రు
పలుకు నుడికారమున నాంధ్రభాషయందు
రెవ్వరేమన్ననందుగాకేమి కొఱఁత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష!

నాటికవు లాతనిని గాకులవలె పొడిచియుందురు. కావుననే నాటి విత్వము కర్ణాటభాషయే పొండని విసిగివిసరి కొట్టినాఁడు. అంతేగాదు నాటి రాజమహేంద్రపుర విద్వాంసులను కవులను నవకాశము చిక్కినపుడెల్ల నాక్షేపించినాఁడు.

"విద్వాంసుల్ రాజమహేంద్రపట్టణమునన్ ధర్మాసనంబుండి ప్రధ్వంసాభావము ప్రాగభావము చుం దర్కించుతు రశ్రాంతమున్" బహుశః అచటిపండితులు శ్రీనాథుని ప్రవర్తనమునను, ఆతని వ్యక్తిగత జీవనమునునుగూడ ప్రేలుపెట్టి విమర్శించి యుందురు.

భీమేశ్వర పురాణరచనముచేత అన్నమాత్యునిద్వారా రాజాశ్రయము లభించినది. పిమ్మట శ్రీనాథుఁడు కాశీఖండము తెనిగింప మొదలిడెను. శీఘ్రకాలములో దానిని ముగించి వీరభద్రారెడ్డి కంకితమొసంగెను. అప్పటికే శ్రీనాథునికి డెబ్బదియేండ్లు వచ్చెను. శరీరపాటవమించుక సడలినది. కాని కవితాపాటవము మాత్రము సడలలేదు. అహా! ధన్యజీవి! ఎన్ని కావ్యములను రచించెను! శ్రీనాథుడే కాశీఖండమున నిట్లుచెప్పినాడు—

చిన్నారిపొన్నారి చిఱుతకూకటినాడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూగుమీసాల నూత్న యౌవనమున
శాలివాహనసప్తశతి నొడివితి
సంతరించితి నిండుజవ్వనంబునయందు
హర్షనైషధకావ్య మాంధ్రభాషఁ

ప్రౌఢనిర్భరవయః పరిపాకమునఁగొని
యాడితి భీమనాయకుని మహిమఁ
బ్రాయమింతకు మిగులఁగైవ్రాలకుండఁ
గాశికాఖండమనుమ ఈ గ్రంథ మేను
దెనుగుచేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

శ్రీనాథుఁడా వార్ధకమునఁ దనగత జీవితమును దన రచనా వ్యాసంగమును సింహావలోకన మొనర్చుకొనినాఁడు. ఎన్ని గ్రంథములు! తానెట్లు వ్రాయగలిగెనో! ఏ పూర్వ కవియు నిన్ని గ్రంథములను రచింపలేదే! మరుత్తరాట్చరిత్ర, పలనాటివీరచరిత్ర, పండితారాధ్యచరిత్ర, శాలివాహన సప్తశతి, నైషధము, భీమపురాణము, హరవిలాసము, శివ రాత్రి మహాత్మ్యము. కాశీఖండము! భగవద్దత్తమైన కవితా శక్తిని సంపూర్ణముగ వినియోగించుకొనినాడు.

కాశీఖండమును గృతినందిన వీరభద్రారెడ్డి శ్రీనాథుని విశేషముగ నాదరించి గౌరవించెను. వార్ధక్యమున శ్రీనాథు నికిఁ దగిన ఆశ్రయమే లభించినది. వార్ధక్యమువలననే కాశీ ఖండమునకు బిమ్మట నాతఁడు గ్రంథరచనము సాగింపలేక పోయినాడు. కాని కవితావ్యాసంగము, పద్యరచనము మాత్రము కొనయూపిరి యున్నంతవఱకును మానలేదు. అసంఖ్యాకములైన కావ్యములను రచించినట్లే, బహుదేశా టన మొనర్చినవాడును, ననంతమైన లోకానుభవముండిన వాఁడును నైనకారణమున నాతఁడనేక చాటుపద్యములను

సైతము రచించెను. తన కంటి కింపైన దానినెల్ల రమణీయముగ వర్ణించినాఁడు. (ఆతని యీ ప్రవృత్తినిఁగాంచియే లోకు లాతనిని విటాగ్రేసరునిగ భావించి చిత్రించినారు. శివభక్తాగ్రేసరునికి, కవిసార్వభౌమునికి పామరజను లొసగిన రూపకల్పనమిది! శ్రీనాథుఁడు శృంగార ప్రియుఁడే కావచ్చును; ధనమును విచ్చలవిడిగ వెచ్చించినాఁడై యుండవచ్చును. సృష్టికి సౌందర్యభూతమైన స్త్రీజాతిని వర్ణించి యుండవచ్చును. ఇంచుక జారత్వదోషము సైతముండి యుండవచ్చును. కాని యీ శివభక్తాగ్రేసరుఁడు, ఆ కవిశిఖామణి మనకొసఁగిన అమూల్యనిక్షేపమునకు బదులుగా నాతని యాత్మను దర్శింపలేక, వ్యక్తిగతమైన బలహీనతలను కొండంతలొనర్చి, సామయిక పరిజ్ఞానమును విస్మరించి విమర్శించుట, ఆమహాకవిని తుచ్ఛముగ చిత్రించుట తగదు.) అది యీకవిసార్వభౌముని యెడల నపచారమగును. సత్కవి దూషణము సమస్తపాపములకుఁ గారణమగును.

కవిసార్వభౌముఁ డొకసారి పలనాడు పోవుట తటస్థించెను. మహాభోగియైన శ్రీనాథుని కచటి యాహార విహారాదులు నచ్చలేదు కాబోలును—

క॥ రసికుఁడు పోవఁడు పల్నా
డెసఁగంగా రంభయైన నేకులు వడకున్
వసుధేశుఁడైన దున్నును
గుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్.

ఉ॥ అంగడి యూరలేదు వరియన్నములేదు శుచిత్వమేమి లే
దంగన లింపుగాదు, ప్రియమైన వనంబులులేవు నీటికై
భంగపడంగఁ దోఁచ్చడు కృపాపరు లెవ్వరులేరు దాత లె
వ్వంగను సున్న గానఁ బలనాటికి మాటికిఁ బోవనేటికిన్.

ఉ॥ దోసెడుకొంపలోఁ బసులత్రొక్కిడిమంచముదూడ రేణమున్
పాసిన వంటకంబు పసిబాలుర శౌచము విస్తరాకులున్
మాసిన గుడ్డలున్ బలుకుమాసిన ముండలు వంటకుండలున్
రాసెఁడు కట్టెలుం దలపరాదు పురోహితునింటికృత్యముల్.

క. జొన్న కలిజొన్న యంబలి
జొన్నన్నము జొన్నపిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్నసుమీ
పన్నగఁ బల్నాటిసీమ ప్రజలకు నెల్లన్.

క. గరళము మ్రింగితినంచున్
బురహర! గర్వింపఁబోకు పోపో పోనీ
బిరుదింకఁ గానవచ్చెడు
మెరసెడి రేనాటి జొన్న మెతుకులుతినుమీ!

ఇట్లే శ్రీనాథుఁడు దక్షిణదేశమున కరిగినప్పుడు తానచట జూచిన వింతలను, వారి యాచార స్వభావములను వర్ణించినాఁడు—

తే॥ గీ॥ మేతఁగరి పిల్లపోరున మేకపిల్ల
పారబోతు తనంబునఁ బందిపిల్ల
ఎల్లపనులను జెరుపంగఁ బిల్లిపిల్ల
అందమునఁ గ్రోతిపిల్ల యీ యఱవపిల్ల.

సీ. తొలుతనే వడ్డింత్రు దొడ్డమిర్యపుఁజారు
చెవులలోఁ బొగ వెళ్ళి చిమ్మరేఁగఁ
పలు తెలఁగులతోడఁ బచ్చళ్ళు చవిగొన్న
బ్రహ్మరంధ్రము దాఁకఁ బారునావ
యవి [illegible]వేఁచిన నార్నెల్లు పసిలేదు
పరిమళమెంచినఁ బండ్లుసొగచు
వేపాకు నెండించి వేసిన పొళ్ళను
గంచానఁ గాంచినఁ గ్రక్కువచ్చు.

'అఱవవారింటి ఎండెల్ల నాగడంబు' అని వారి తిండి తీరులను వర్ణించినాఁడు. అఱవవారినేగాదు, ఆంధ్రులైనవారిని సైతము మాతఁడు విడువలేదు. పల్నాటిసీమలో కవిసార్వభౌముని కొకయింట జొన్నకూడును, చింతచిగురుతో బచ్చలి శాకమును గలిపి వండి వడ్డింపగా మహాభోగియైన శ్రీనాథునకుఁ గనుల నీరూరెను గాబోలును—

ఉ॥ ఫుల్లసరోజనేత్ర! యలపూతన చన్నులచేఁ దుద్రావినాఁ
డల్లదవాగ్ని మ్రింగితినటంచును నిక్కెదవేల? తింత్రిణీ
పల్లవయుక్తమౌ నుడుకు బచ్చలిశాకము జొన్నకూటితో
మెల్లన యొక్కముద్ద దిగమ్రింగుము! నీపసకాననయ్యెడిన్.

అని సహాలుచేసినాఁడు. ఇట్లే శ్రీనాథుని పేరఁ బ్రచారములోనున్న చాటువు లసంఖ్యాకములు.

శ్రీనాథుఁడొకసారి పలనాటిలో ప్రయాణ మొనర్చుచుండగా త్రోవలో నాతనికి దాహమయ్యెను. అయ్యది గ్రీష్మర్తువగుటవలన బావులలో, చెరువులలో నీరింకి పోయి

యుండెను. బాహముతోఁ గవిసార్వభౌముఁడు తల్లడిలి పరమేశ్వరునిపై ధ్వజమెత్తినాఁడు—

సిరిగలవానికిఁ జెల్లును
తరుణులు పదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
తిరిపెమున కిద్దఱాండ్రా
పరమేశా ! గంగవిడుము పార్వతిచాలున్.

వీరభద్రారెడ్డి మరణము వార్ధకముననున్న శ్రీనాథునికి గొడ్డలిపెట్టయినది. శరీరమున నోపికలేదు. వయసున సంపాదించిన ధన మేనాటిదానాడే చెల్లిపోయినది. నాడు సంపాదించి యలవాటొనర్చుకొనిన భోగానుభవవాంఛలు మాత్రమే మిగిలియున్నవి. అంత్యదశలో దారిద్ర్యము, బాధలు ప్రారంభమైనవి. అంతటి మహావైభవ మనుభవించి, కవితాదిగ్విజయయాత్ర చేసిన మహాకవికి తిండి కఱవైనది— అంత్యదశలో! చేయునదిలేక శ్రీనాథుఁడు కృష్ణాతీరమున బొడ్డుపల్లెయను గ్రామమును గుత్తకుఁ దీసికొనినాడు. నదీప్రవాహము వలనను, పక్షులవలనను పంటలు పండలేదు. గుత్తధనమును చెల్లింపలేకపోయినాఁడు. ధనైకజీవులైన రాజుల వలన ననేకబాధలకు లోనైనాఁడు. ఆబీదతనము కవిహృదయమును కలచివేసినది. ఆహా! కవి యనుభవింపఁదగిన కష్టములేనాయవి ?

కవిరాజు కంఠంబుఁ గౌగలించెనుగదా
పురవీథి నెదురెండ పొగడదండ

సార్వభౌముని భుజాస్కంధ మెక్కెనుగదా
నగరివాకిటనుండు నల్లగుండు
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ

కృష్ణవేణమ్మ కొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలుపెసలు
బొడ్డుపల్లెను గొడ్డేలి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు?

కవి హృదయరక్తముచే లిఖించిన మాటలివి! అట్టి బ్రతుకున కిట్టి పరిణామము! కవిహృదయము నీరైపోయినది. తన జీవితము తనకే యాశ్చర్యమును, విషాదమును కలిగించినది.

కాశికా విశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబులే రాయఁడిచ్చుఁ
గైలాసగిరిఁబండె మైలారు విభుఁడేగి
దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు
రంభఁగూడెఁ దెనుఁగురాయరాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱిహేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁగలదు?

భాస్కరుఁడు మున్నె దేవునిపాలికరిగెఁ
గలియుగంబున నిఁకనుండఁ గష్టమనుచు
దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁడమరపురికి.

ఆహా! ఎంతటి యహంభావము! వసరాకచే దివిజ కవివరు లంతెపులు దిగ్గురనునట! కాదామఱి? భూలోకమున కవితాదిగ్విజయయాత్ర సల్పి స్వర్గమున కేతెంచుచున్న కవి సార్వభౌముని వృత్తాంతమువిని బృహస్పతి గుండె లదురు టలో నాశ్చర్యమేమి?

కవిసార్వభౌమా! నమోవాకములు! కవినిపోషింపఁ జాలని లోకమున నీవెట్లుండఁగలవు? కవిబ్రహ్మవైన నీకు శ్రద్ధాంజలులుఁదప్ప నేమొసంగగలము? హృదయనీరజ దళములనుండి రాలు కన్నీటిచుక్కలచే నీకుఁ దర్పణ లిచ్చుట కంటె మావలన నేమగును? ఉదయభానునివోలె నుదయమై స్వర్ణకిరణ ప్రభాజాలములచే విశ్వమును రంజింపజేసి, మధ్యాహ్న మార్తాండునివలె నుద్దండ పండిత ప్రతివాద భయంకరుఁడవై మించివెలింగి, దినావసాన సమయమునను సైతము సంధ్యారుణకాంతిపుంజములచే జగమునకు హాయిని, విశ్రాంతిని నొసఁగి యస్తమించిన కవిభాస్కరా! ఇవే మా నమోవాకములు.

శ్రీయన గౌరినాఁబరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయయని పల్కెడు భక్తజనంబు వైదిక
చ్ఛాయిత కిచ్చ మెచ్చు పరతత్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

—తిక్కన.

సీ. సుకవీంద్రబృంద రక్షకుఁడెవ్వఁడనిన వీఁ
డను నాలుకకుఁ దొడవైనవాఁడు
చిత్తనిత్యస్థిత శివుఁడెవ్వఁడనిన వీఁ
డను శబ్దమున కర్థమైనవాఁడు
దశదిశా విశ్రాంత యశుఁడెవ్వఁడనిన వీఁ
డని చెప్పుటకుఁ బాత్రమైనవాఁడు

గీ. మనుమసిద్ధిమహీశ సమస్తరాజ్య
భారధౌరేయుఁ డభిరూపభావభవుఁడు
కొట్టరువు కొమ్మనామాత్యు కూర్మిసుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి.

సీ. సరస కవీంద్రుల సత్ప్రబంధములొప్పఁ
గొనునను టధికకీర్తనకుఁదెరువు
లలితనానాకావ్యములుచెప్పి నుభయ భా
షలయందు ననుట ప్రశంసత్రోవ
యర్థిమైఁ బెక్కండ్ర కగ్రహారంబులుఁ
గానిచ్చుననుట పొగడ్తః పొలము
మహిత దక్షిణలైన బహువిధ యాగంబు
లొనరించుననుట వర్ణనముదారి

గీ. పరునికొక్కని కిన్నియుఁ బ్రకటవృత్తి
నిజములై పెంపుసొంపారి నెగడునట్టి
కొమ్మనామాత్యు తిక్కని కొలఁది సచివు
లింక నొక్కరుఁ డెన్నంగ నెందుఁగలఁడు ?

— కేతన

విక్రమసింహపురమున బ్రాహ్మణవీధిలోనొక యింటి ముందటి యరుగుపై నొక బ్రాహ్మణుఁడు గూర్చుండి తాటి యాకులపై గంటముతో వ్రాయుచున్నాఁడు. గంటమునకుఁ జివఱనున్న పైడిచిఱుగంటలు టంగుటంగుమని శ్రుతి మనో హరముగ ధ్వనిసేయుచున్నవి. ఆతని వయస్సు ముప్పదియైదు నలుబది సంవత్సరముల మధ్యనుండును. సుదృఢమై సువర్ణ చ్ఛాయగల శరీరము. విశాలమైన ఫాలము. దీర్ఘనాసిక. విశా లములైన నేత్రములు నాతని శేముషీవిభవమును జాటు చున్నవి. ఆతని శిష్యు లొకమూల గూర్చుండి పాఠములు చదువుచున్నారు. ఆతఁడు మాత్రము తదేకధ్యానమున నేదో లిఖించుచున్నాఁడు. రాజాస్థానమునుండి భారవాహులు కావిళ్ళతోఁ గొనివచ్చిన వస్తుసంభారాదికములను సైత మాతఁడు గమనించినట్లులేదు. సమీపముననున్న దేవాల యమునుండి మాధ్యాహ్నిక పూజాఘంటానాదము లాతనిని కవితాసమాధినుండి ప్రకృతస్థు నొనర్చినవి. ఆ గ్రంథమును గట్టిపైచి లేచి యింటిలోని కేఁగినాఁడు. ఆతఁడే కవిబ్రహ్మ తిక్కనామాత్యుఁడు. ఆతఁడు ప్రస్తుతము నిర్వచనోత్తర రామాయణమును రచించుచున్నాడు.

తిక్కనామాత్యుని పూర్వులు కృష్ణాతీరస్థమైన వెల్ల టూరి నివాసస్థులు. ఈతని తాత యుద్యోగధర్మము నను సరించి గుంటూరు వచ్చెను. ఈతని తాతపేరు భాస్కరుఁడు.

వీరియింటిపేరు కొట్టరువువారు. ఈతని తాతయైన భాస్కర మంత్రి శాపానుగ్రహ శక్తియుక్తుఁడు. సాహిత్యవిద్యా పారీణుఁడు. అర్థార్థిలోకావన వ్యాపారవ్రతుఁడు, శంకర శ్రీపాదప్రవణాంతరంగుఁడు, విమలాచారుఁడు, ధర్మమార్గైక పరతంత్రుఁడు. ఈ భాస్కరమంత్రికిఁ గేతన, మల్లన, సిద్ధన, కొమ్మనయను నల్గురు పుత్రులుదయించిరి. అందు సిద్ధనామాత్యుని యగ్రపుత్త్రుఁడు రణతిక్కన. అతఁడే ఖడ్గ తిక్కన యనుపేరఁ బ్రసిద్ధుఁడైనవాఁడు. కవితిక్కనకు పెదతండ్రి కుమారుఁడు. కొమ్మనామాత్యుని పుత్త్రుఁడు కవితిక్కన.

తిక్కన అగర్భశ్రీమంతుఁడు. జీవనోపాధి కెన్నఁడును లోటులేని యింటఁబుట్టినాఁడు. బాల్యమునుండియు నాతఁడు ప్రతిభావంతుఁడై యుండెను. అక్షరాభ్యాసమైనదాది యాతడు వేదశాస్త్రముల నభ్యసించి విశేషపాండిత్యమును గడించెను. ఆతని పూర్వులందఱును వైదికవిద్యల నభ్యసించి, వైదికానుష్ఠానములను నెఱపినవారు. ఈతని తాతయగు భాస్కరుఁడేగాక తండ్రియైన కొమ్మనామాత్యుఁడుగూడ సాంగముగ వేదాధ్యయన మొనర్చినవాఁడు. తండ్రివలెనే యాతఁడును వేదమతానుయాయి. శ్రౌతస్మార్తకర్మ తత్పర మతియైనవాఁడు పెద్దవాఁడైన పిమ్మట మనుమసిద్ధివద్ద మంత్రియైనాఁడు. సమస్త విద్యలతోబాటు ధర్మశాస్త్రము, జ్యోతిషము, ఆయుధవిద్య, కవిత్వము మున్నుగాఁగల కళలందును నిష్ణాతుఁడై రాజున కధికగౌరవ పాత్రుడయ్యెను.

తిక్కన కాశ్రయమిచ్చిన మనుమసిద్ధి తిక్కభూపాలుని పుత్త్రుడు. ఈతిక్కరాజు కర్ణాట, పాండ్యులను ద్రావిడులను

జయించి రాజరాజచోడుని కాంచీపురమున ప్రతిష్ఠించి చోళ స్థాపనాచార్య బిరుదమును వహించినవాడు. ఈతని కుమారుడే మనుమసిద్ధి. ఈతఁడు తండ్రివలెనే పరాక్రమవంతుఁడు. ఈతనికి తిక్కనామాత్యుఁడు మంత్రియగుటయే యదృష్టము. తిక్కనామాత్యుని పెదతండ్రియైన సిద్ధనామాత్యుడు తిక్కరాజువద్ద మంత్రియు సేనాపతియునై యుండుటచే కవితిక్కనకు రాజవంశముతో బాల్యమునుండియు పరిచయముగలదు. సిద్ధనామాత్యునికి తిక్కనయను కుమారుడుండెను. ఆతఁడు గూడ మనుమసిద్ధి యాస్థానమున మంత్రియు, సేనాపతియునై యుండెను. ఇట్లు కొట్టురువు వంశము వారికిని నెల్లూరు పాలకులకును తరములనుండి సంబంధముండెను. ఆ సంబంధమును పురస్కరించుకొనియే మనుమసిద్ధి తిక్కనామాత్యుని 'మామా' యని పిలచెడివాడు. ఆరాజమంత్రుల సౌహార్దమట్టిది !

తిక్కనామాత్యుని గృహము వాణీవిలాసభూమి. అయ్యది లక్ష్మీసరస్వతులకుఁ గేళీనిలయము. తిక్కనామాత్యుఁడు రాజగౌరవముగలవాఁడు. సంపన్నుఁడు. విద్యావంతుఁడు. కవిపండితపోషకుడు. దాత. ఆనాడాంధ్రకవిత్వ సామ్రాజ్యము నేలినవాడు తిక్కనామాత్యుడే! ఆతఁడుభయ భాషా కవిత్వవిశారదుఁడు. ఉభయకవిమిత్రుఁడు, కవిబ్రహ్మ. కవిసంఘమున కాతఁడు పూజ్యుడు. అతఁడనేకమంది కవుల కాశ్రయమొసఁగి యుత్సాహపఱచెను. ఎల్లప్పుడు కవితావ్యాసంగములతో, కవిపండిత గోష్ఠిలో కాలము బుచ్చుచుండెడివాడు. తీరిక వేళలందు రాజకీయములు చూచుచుండెడివాడు. మనుమసిద్ధి కీతనిమాట వేదవాక్యము. నాటి

కవులందఱును తిక్కనామాత్యుని దర్శించి యాతని మన్ననకై ప్రాకులాడినవారే! తిక్కన మెచ్చినచో నా కావ్యము లోకాదరణ పాత్రమైనది. తిక్కనచే సమ్మానితుఁడైనవాఁడేకవి.

ఒకనాఁడు మనుమసిద్ధి తిక్కనామాత్యుని పిలిపించి యిట్లనెను—

"ఏనిన్ను మామయనియెడు
దీనికిఁదగనిమ్ము భారతీ కన్యకనా

కీనర్హుఁడవగుదు"వని ప్రార్థించినాఁడు. ఆ ప్రార్థనను మన్నించి తిక్కనమనుమసిద్ధి కొకకృతి నీయసంకల్పించుకొనెను. ఆకారణముననే యిపుడాతఁడు నిర్వచనోత్తర రామాయణ కావ్య రచనావ్యాసంగమున నిమగ్నుఁడై యున్నాఁడు.

నాటివఱకునున్నకావ్యములు పద్యగద్య మిశ్రితములై యుండెను. తిక్కన తనకావ్యమును సంస్కృత రఘువంశ కుమారసంభవాదులవలె కేవల పద్యగ్రంథముగా రచింపవలెనని సంకల్పించుకొనెను. ఆతనిపితామహుఁడు భాస్కరామాత్యుఁడు మహాకవియై రామాయణమును రచియించి యుండుటచే గాబోలు నాతఁ డుత్తరరామాయణమును వస్తువుగా గ్రహించెను. తిక్కనఆశుకవితాధురీణుడగుటచే రచనముశరవేగమున సాగిపోవుచుండెను. కృతిపతి వంశవర్ణనాదికములు, కుకవినిందలు, ఇష్టదేవతా పూర్వకవిస్తుతులు పూర్తియైపోయినవి. కథను నడిపించుటలో తిక్కన సంస్కృతోత్తర రామాయణమునుండి కథను గైకొన్నను కొన్నిమార్పులు

కూర్పులు చేసి యనుచితములను పరిహరించి స్వతంత్ర రచనముగాఁ జేసెను.

మనుమసిద్ధి రాజేయైనను తిక్కనామాత్యుని యంగీకారము లేక యెట్టిపనిని జేసెడివాఁడుకాడు. తిక్కనపై నాతనికి గౌరవ విశ్వాసములు మెండు. తిక్కనయు మనుమసిద్ధి యభ్యుదయమునే యెల్లప్పుడు కాంక్షించువాఁడు. మనుమసిద్ధి మొదటి నుండియుఁ గాంచీపుర చోడులకు సామంతుఁడై యుండెను. అనేకపర్యాయములు మనుమసిద్ధికి శత్రువులవలన నపాయము సంభవించుటయు కవిరణతిక్కనల మంత్రపరాక్రమములచే నా ప్రమాదములనుండి బయటపడుటయు సంభవించినది.

ఒకపర్యాయము మహారాష్ట్ర సారంగునితో జరిగిన యుద్ధమున నాతనినిపారఁద్రోలి తురంగమునుగొనియీమనుమసిద్ధికాకతి గణపతిదేవుని యనుగ్రహమునకుఁబాత్రుడయ్యెను. తరువాతఁ గొంతకాలమునకు గణపతిదేవునికే సామంతుఁడయ్యెను.

తిక్కన నిర్వచనోత్తర రామాయణమున పదియాశ్వాసములుపూర్తిచేసెను. ఏకాదశాశ్వాసము మాత్రమే మిగిలియున్నది. పది పదునైదుదినములు గడచిపోయినవి. తిక్కనకేకాదశాశ్వాసముఁ బ్రారంభించుటకు మనసావ్వటలేదు. గంటము సాగకున్నది.

ఒకనాఁడు మనుమ సిద్ధితిక్కనతో— 'మామా!నా యభ్యర్థనము నేమిచేసితివి? ఉత్తరరామాయణమెంత వఱకు

వచ్చినది? నన్నుఁగృతార్థుని జేయుట కింకెంతకాలముపట్టును?" అనెను.

"పూర్తికావచ్చినది. పదియాశ్వాసములు పూర్తియైనవి. ఒక్కయాశ్వాసము మాత్రమే మిగిలియున్నది. ఇప్పుడొకటీఅని సమస్య నన్ను బాధించుచున్నది. ఏమిచేయుటకును దోచకున్నది."

"కవిబ్రహ్మలకు, ఉభయకవిమిత్రులకుఁ దిక్కనామాత్యులకు సమస్యయే మున్నది?"

"పదునొకండవ యాశ్వాసము వ్రాయుటకు మనసొప్పకున్నది."

"కారణమేమి?"

"భగవానుఁడైన శ్రీరామచంద్రుని నిర్యాణమును వర్ణించుటకు నామనస్సు అంగీకరింపకున్నది. కావ్యమును దుఃఖాంత మొనర్చుట కిష్టములేదు. అసంపూర్ణమైన కావ్యమును ప్రభువుల కంకిత మొనర్చుటకును మనస్సు సమ్మతింపకున్నది."

"ఉత్తరరామాయణమున నున్న కథను జెప్పుటలోఁ దప్పులేదుగదా! సంస్కృతమునయున్న రామాయణము కావ్యమేగదా!"

"అవును! వాల్మీకిమహర్షి శ్రీరాముని విజయముతో పట్టాభిషేకముతో కావ్యమును బూర్తిచేసినాఁడు. ఉత్తర రామాయణము దాని కనుబంధము మాత్రమే! నా కావ్యమటు కాదుగదా!"

"మీరు చెప్పినది యుక్తియుక్తముగనే యున్నది."

"అంతేకాదు. మరణపర్యవసాయిరైన కావ్యమును మీ కిచ్చుటకును మనస్సు సమ్మతింపకున్నది."

అట్లయినచో రచించినంతవఱకే యంకిత మొసంగుడు. శ్రీరాముని పుత్త్రులైన కుశలవుల చరిత్ర ప్రధానముగా గలదగుటవలన నింతవఱకు రచించిన కథసుఖాంతము, సంపూర్ణమే యగునుగదా! శ్రీరామనిర్యాణగాథ చేర్చక పోయినను కావ్య పరిపూర్తికి లోటు వాటిల్లదుగదా!"

"నా తలంపును నదియే! కుశలవుల చరిత్రతో సుఖాంతమైయున్న గాథను మఱల దుఃఖమధ్యములోనికీడ్చి దుఃఖపర్యవసాయిగా నొనర్చుట నాకిష్టములేకున్నది. ఉచితమని తోచినచోఁ బిమ్మట నెప్పుడైనను బూర్తిచేయ వచ్చును."

తిక్కన నిర్వచనోత్తర రామాయణము నంతటితోఁ బూర్తిచేసినాఁడు. ఒకానొక శుభదినమున గృతి సమర్పణ మహోత్సవము సైతము పూర్తియైనది. మనుమసిద్ధి నృపాలుని చిరవాంఛిత మీడేరినది.

తిక్కన కావ్యరచనా వ్యాసంగమున మునిగియుండి రాజకీయముల కించుక దూరుఁడై యున్న సమయము మనుమసిద్ధికి దాయాదులై శత్రువులైయున్న అక్కన, బయ్యనలకు మిక్కిలి యనుకూలమైనది. మనుమసిద్ధిని దొలగించి తాము రాజ్య మాక్రమింపవలెనని వారు రహస్యముగ కుట్రలు పన్నసాగిరి.

ఇంతలో తిక్కనామాత్యునకుఁ గుంటూరు వెళ్ళవలసిన యగత్యము కలిగెను. తండ్రి కొమ్మనామాత్యుఁడు గుంటూరులో దండనాథుఁడుగా నుండెను. ఆతఁడిప్పుడు మిక్కిలి వృద్ధుఁడై యవసానదశలోనుండి పుత్త్రునొకసారి రమ్మని కబురంపెను. ఆకారణమున తిక్కన పరివారముతోఁగూడ గుంటూరునకు బయలుచేరెను.

మనుమసిద్ధి దాయాదులకు మంచి యవకాశము చిక్కినది. అఘటఘటనా సమర్థుఁడును, రాజనీతి విశారదుడును, ప్రభుభక్తి పరాయణుఁడునునైన తిక్కనామాత్యుఁడు రాజధానిలో లేనిసమయము వారి కనుకూలముగాక మఱేమగును ? తిక్కన నెల్లూరు విడచి వెళ్ళునపుడు మనుమసిద్ధి ననేకవిధముల హెచ్చరించెను. తనకు స్వామిభక్తులని తోఁచిన వారిని తగుకార్యములందు నియోగించెను.

తిక్కన రాజధానిని వీడినంతనే కుట్రదారుల కుత్సాహము కల్గినది. అక్కన బయ్యనలు లంచములిచ్చియు, పదవుల నాశపెట్టియుఁ గొందఱుద్యోగులను తమవైపునకుఁ ద్రిప్పుకొనిరి.

ఒకనాటి యర్ధరాత్రమునఁ గుట్రదారులు రాజభవనమునఁ బ్రవేశించిరి. రాజభక్తిపరాయణులు కొందఱు వారి నడ్డగించినను, అర్ధరాత్రివేళ అకస్మాత్తుగ జరిగినదాడి కల్పసంఖ్యాకులైనవారు నిలువఁజాలకపోయిరి. తిక్కనకుఁ పెదతండ్రి కుమారుఁడును, దండనాథుఁడునైన రణతిక్కన పరి[illegible] తులు విషమించినవని గ్రహించినాఁడు. కార్యము [illegible]

అప్పుడు లొంగిపోవుటయు, పరిస్థితు లనుకూలించినపుడు విజృంభించుటయు రాజనీతి. కావుననే రణతిక్కన కుట్రదారులతో గలసెను. వారాతనిని విశ్వసించిరి. రణతిక్కనయే మనుమసిద్ధిని బంధింపవలెనని చెప్పెను. కుట్రదారులు కొందఱు మనుమసిద్ధిని వధింపవలెననిరి. కాని రణతిక్కన వారి కిట్లుపదేశించెను — "మనమిప్పుడు మనుమసిద్ధిని వధించినచోఁ బ్రజలు మనకు ప్రతికూలురగుదురు. రాజ్యాధికారము స్థిరపడు నంతవఱకు నాతనిని బంధించియుంచి పిమ్మట పరిస్థితుల ననుసరించి కర్తవ్యము నిర్ణయించుకొనుట యుచిత"మనెను. రణతిక్కన యుక్తి అక్కన బయ్యనలకు నచ్చినది. అర్ధరాత్రము ననే విప్లవకారులు మనుమసిద్ధి భవనమును చుట్టుముట్టిరి. ఆ సైన్యముతో రణతిక్కనయుఁ జేరెను. ఆతఁడు మనుమసిద్ధి ప్రాణమును గాపాడుటకై యహర్నిశలు జాగరూకుఁడై యుండెను. మనుమసిద్ధి తనభవనమునందే బంధితుఁడై యున్నాఁడు. అక్కన బయ్యనలు అధికారమును హస్తగత మొనర్చుకొనిరి.

రణతిక్కన విప్లవకారులు విజృంభించిన వెంటనే చారు నొక్కనుని బిలిపించి పరిస్థితులను దెలియజెప్పి తాను నిర్ణయించుకొనిన కర్తవ్యమును తిక్కనామాత్యునికిఁ దెలియజేయవలసినదిగా బంపెను. తిక్కనామాత్యుఁడు గుంటూరు జేరిన మూఁడవనాఁడే చారుఁడును వచ్చెను. ఈ వార్తవిని తిక్కనామాత్యుఁడు నిర్విణ్ణుఁడయ్యెను. కాని ధైర్యముఁ గోల్పోవలేదు. రణతిక్కనఁ జూపిన చాతుర్యమునకు మెచ్చు

కొని యాచారుని తనవద్దనే యుంచుకొని మఱియొక విశ్వాస పాత్రునిద్వారా కర్తవ్యమును నిర్ణయించి రణతిక్కనకు తెలియ జేసెను.

రెండు నెలలు గడచినవి. మూడు నాల్గు నెలలు గడచినవి. తిక్కనామాత్యుని జాడలేదు. మనుమసిద్ధి కారాగార బద్ధుఁడై యుండి విచారముతోఁ గ్రుంగిపోవుచుండెను. ఒకనాఁ డాతనికి రణతిక్కన కన్పించెను. మనుమసిద్ధి యాతనినిఁ గాంచి యసహ్యముతో మోము ప్రక్కకుఁ ద్రిప్పుకొనెను. రణతిక్కన మనుమసిద్ధినిజూచి— 'మహారాజా! నన్నస హ్యించుకొన నక్కరలేదు. విధిప్రతికూలమైనపుడు చేయున దేమియులేదు. మంచిరోజులకై యెదురుచూచుటతప్ప మాన వుఁడు చేయగలిగిన దేదియు లేదు" అనెను.

"అవును. తిక్కనామాత్యులను రాజధానినుండి పంపిన నాఁడే నేను రాజ్యచ్యుతుఁడనైతిని. నీవంటివారందఱునుఁ గుట్రలోఁజేరియున్న నెట్లుంగనైతిని. అందఱును తేనె పూసిన కత్తులు, పయోముఖ విషకుంభములు!"

"ఇప్పుడిక ప్రభువులకుఁ గోపము శోభింపదు. సెలవు."

అక్కన బయ్యనల కింతవఱకును, తిక్కనామాత్యుడు తిరిగి వచ్చునేమో యనియు, అతఁడేమి పన్నాగములు పన్నునో యనియు భయపడుచుండిరి. ఆరునెలలు కావచ్చు చున్నను తిక్కన జాడయే లేదు. తిక్కనామాత్యుని చారులు తిక్కనామాత్యు తండ్రి పరలోకగతుఁడైనట్లును, ఆతడిక తిరిగి రాడనియు గుంటూరులోనే యుండిపోవుననియు ...

వ్యాపింపఁజేసిరి. అక్కన బయ్యనలు నిశ్చింతులైరి. రణతిక్కన వారికి విశ్వాసపాత్రుఁడయ్యెను. ప్రజలు మనుమసిద్ధిని, తిక్కనామాత్యుని మఱచిరి. అక్కన బయ్యనలు మధ్యమధ్య మనుమసిద్ధిని వధింపవలెనని యత్నించుచుండిరి. కాని రణతిక్కన వారితో—"ప్రజలు మనుమసిద్ధి పాలనమును మఱచి యున్నారు. మనపాలనము నిష్కంటకముగ సాగిపోవుచున్నది. ఇట్టితరుణములో నకారణముగ మనుమసిద్ధిని జంపి ప్రజల కోపమునకుఁ గురియగుట మంచిదికాదు. కారాగార బద్ధుఁడైన మనుమసిద్ధివలన మనకుఁ గలుగు కీడేమియులేదు. తిక్కనామాత్యుఁడిక రాడు. గుంటూరులోఁ గుదురుకొని నాఁడు. ఆతఁ డిల్లుకదిలి బయటకే వచ్చుటలేదట, మా పినతండ్రి మరణము, ప్రభువుల పదచ్యుతి యాతనిని క్రుంగదీసినవి. ఇప్పుడు మనుమసిద్ధిని మనము వధించినచో నిద్రించు సింహమును లేపినట్లే కాగలదు." అనిచెప్పుచుండెను. వారును నాతని మాటలను విశ్వసించిరి.

తిక్కనామాత్యుఁడు. గుంటూరులోఁ దనవిధులను నిర్వర్తించుకొని యెవ్వరికిఁ దెలియకుండ రహస్యముగ నోరుగంటికి బయలుదేరెను. తిక్కనామాత్యుడు విచారగ్రస్తుడై యిల్లు వెడలుటలేదనియు, నిర్వేదముతో నింటిలోనే యుండిరనియుఁ బ్రవాదము గుంటూరులో వ్యాపించెను. ఆ ప్రవాదమే నెల్లూరిలో సైతము వ్యాపించినది.

తిక్కనామాత్యుఁడు ఓరుగల్లు పోవలెనని నిశ్చయించుకొనెను. ఓరుగల్లు పాలకుఁడగు గణపతిదేవ...

మాజుల సుమహసిద్ధిని రాజ్యప్రతిష్ఠితు నొనర్పవలెనని యాతని యుద్దేశ్యము.

తిక్కనామాత్యుల రాక గణపతిదేవునికిఁ దెలిసినది. గణపతిదేవుఁ డాతని ప్రశస్తిని గుఱించి వినియున్నవాఁడు. అందుచే నాతఁ డెదురేగి తిక్కనామాత్యుని సగౌరవముగ నాహ్వానించెను. [illegible] రాజ్య[illegible]మంత్రియైనఁ గాకవలనఁ దిన [illegible] రాజ్యశ్రేయస్సునకై తన [illegible]స్థానమును కేతెంచునని యతఁడు భావించెను. తిక్కనామాత్యుని కొక విడిది యేర్పాటు చేయబడెను. అందాతనికి సమస్త సౌకర్యములు సమకూర్పఁబడెను. రెండుమూడు దినములపాటు మార్గా యాసమును దీర్చుకొనిన పిమ్మట తిక్కనామాత్యుడు రాజ దర్శనమును గాంక్షించెను.

ఆనాడు గణపతిదేవుని మోమున నానందము వెల్లి విరియుచుండెను. సభాభవనమున సమధికోత్సాహము గాన వచ్చుచుండెను. గణపతిదేవులు సింహాసనమున నాసీనులై యుండిరి. వారి కించుక సమీపముననే సచివాగ్రగణ్యులైన శివదేవయ్యయు, గోవిందామాత్యులును నితర ప్రకృతివర్గ మును నాసీనులై యుండిరి. గణపతిదేవమహారాజులు తిక్కనా మాత్యులనుగాంచి—"ఉభయకవిమిత్రులు మా సభ నలంక రించినందులకు మా కమితానందమగుచున్నది. కవిబ్రహ్మల యాగమనముతో నేకశిలానగరము పవిత్రమైనది. వారిస్థిర నివాసముతో గాకతీయ సామ్రాజ్యమునకుఁ గీర్తి ప్రతిష్ఠ లినుమడింపగలవని విశ్వసించుచున్నాము. ఆస్థానకవిపీఠమును, అమాత్యపదవిని గ్రహింపవలసినదని యర్థించుచున్నాము."

గణపతిదేవుని మాటలువిని శివదేవయ్య యిట్లనెను– 'ప్రభువు లానతిచ్చినది సత్యము. తిక్కనామాత్యుల ధీశక్తి, స్వామిభక్తి కాకతీయాంధ్ర సామ్రాజ్యమునకుఁ బెట్టనికోటలై కాపాడుగాక! వారి కవితా సంస్కృతి కాకతీయ సామ్రాజ్య కీర్తిని దశదిశలందును వ్యాప్తము జేయుగాక!'

అంతవఱకును అవనతవదనుఁడై యాలోచించుచుండిన తిక్కనామాత్యుఁడు తలవాల్చెను. అతని కనులు చెమ్మగిలి యుండెను. రెండశ్రుబిందువులు సైతము జాలువాఱినవి. వాటిని కొనగోటితో మీటి యిట్లనెను—"కాకతీయ సార్వభౌములు నాపై జూపిన గౌరవాదరములకుఁ గృతజ్ఞుఁడను. శివదేవులు జూపిన యభిమానమునకుఁ గృతజ్ఞుఁడను. ప్రభువు లనినట్లు నేనెల్లప్పుడు నాంధ్రుఁడనే. ఆంధ్రసామ్రాజ్య గౌరవాకాంక్షినే! విశేషించి ప్రభువులయెడ నాకుగల యభిమానము, భక్తిప్రపత్తులు తమకుఁ దెలియనివికావు. మీకు లోఁబడియుండిన మనుమసిద్ధి వద్దనుండిన నేను మీ సామ్రాజ్యములోని వాఁడనుగాక పరుఁడ నెట్లగుదును? నెల్లూరిలో నున్నను, ఓరుగంటిలోనున్నను తిక్కనామాత్యుఁడు కాకతీయ సామ్రాజ్యములోనివాఁడే! అది యటుండనిండు. నేను కార్యార్థినై ప్రభుసన్నిధి కేతెంచితిని."

"తిక్కనామాత్యుల కోరిక యెట్టిదైననుఁ దీర్చుటకు మా కభ్యంతరములేదు."

"ప్రభువుల యధీనమున నున్నవాడును, నాకు ప్రభువునునైన మనుమసిద్ధి ప్రభువు దాయాదులచే రాజ్యముఁ గోల్పోయి బంధితుఁడై యున్నాఁడు."

"తెలిసినది. మనుమసిద్ధిని రాజ్యప్రతిష్ఠితు నొనర్ప వలెనని కవీశ్వరుల కోరిక. అట్లే యగుగాక ! మీ యిష్టము వచ్చినపుడు సేనలను తరలింపవచ్చును తిక్కనామాత్యుల వ్యూహ రచనాదికములను దెలియు నవకాశము కాకతీయ వాహినికి లభించినది. కార్యక్రమమును మీరే నిర్ణయింపుడు. కా ... హదా ... కోరిక యున్నది. మనుమసిద్ధిని రాజ్యప్రతిష్ఠితు నొ ... న పిమ్మటనైనను మీరీ యాస్థానమునకు రావలె."

"చిత్తము.' ప్రభువుల కోరిక నెట్లుతిరస్కరింపగలను?"

తిక్కన గూఢచరునిద్వారా తన కార్యక్రమమును రణతిక్కనకుఁ దెలియఁబఱచెను. తిక్కనామాత్యుని ప్రార్థన ననుసరించి గణపతిదేవుని సేనలు బయలు దేరెను. అట నెల్లూరిలో రణతిక్కన దండనాథుఁడు కోటలోఁ దనకిష్టులను, విశ్వాసపాత్రులను రక్షణకై యుంచెను. కొంత రహస్య సైన్యమును సమీకరించి తిక్కనామాత్యుని రాకకై యెదురు చూచుచుండెను.

పూర్వనిశ్చితము ననుసరించి తిక్కనామాత్యుని వెంట వచ్చిన సైన్యమంతయు మాఱువేషములఁ బురసమీపమున కేతెంచెను. అర్ధరాత్రి యకస్మాత్తుగ గణపతిదేవుని సైనికులు అక్కన బయ్యనలున్న రాజప్రాసాదమును ముట్టడించిరి. తిక్కనామాత్యుఁడు కొంత సైన్యమునుగొని మనుమసిద్ధిని బంధించియుంచిన ప్రాసాదముపై దండెత్తెను. తిక్కనామాత్యున కచట విజయము తేలికగనే లభించెను. ఆతఁడు తెల్లవారునప్పటికి మనుమసిద్ధిని బంధవిముక్తు నొనరించెను.

ఆతని వెంటనున్న సైన్యమంతయు ప్రతిక్కన రహస్యముగ సమకూర్చినదే !

అక్కన బయ్యనల సైన్యము ప్రాణములకుం దెగించి యుద్ధము చేయుచుండెను. తెల్లవారునప్పటికి. తిక్కనామాత్యుండు మనుమసిద్ధితోం బాటు హయారూఢుండై యుద్ధ క్షేత్రమున గన్పట్టుటతో వారి కధైర్యము కలుగుటతో బాటు స్వామిభక్తియుం బెల్లుబికినది గాబోలును శస్త్రాస్త్రము లావల బారవైచి శరణుజొచ్చిరి. అక్కన బయ్యన లిరువురును బంధింపంబడిరి. తిక్కనామాత్యుని ధీవిశేషమున మనుమసిద్ధి మఱల రాజ్యమునం బ్రతిష్ఠితుడయ్యెను. గణపతిదేవుడు మనుమసిద్ధిని నెల్లూరునం బునఃప్రతిష్ఠించి యిరువది యెనిమిది గ్రామముల నిచ్చెను. కాకతీయ సైన్యము ఓరుగంటికి మఱలినవి.

తిక్కన లిరువురును గలసి పన్నిన కార్యతంత్రము సఫలమైనది. నాటినుండియు మనుమసిద్ధి తిక్కనామాత్యునికి మిగుల విధేయుండై యుండెను. తిక్కన సోదరులపైం గార్య భారముంచి తాను నిశ్చింతుండై రాజ్యమేలుచుండెను.

తిక్కనకు రాజకార్యములపై నాశక్తి నానాటికి సన్నగిలి పోవుచుండెను. వయసు పెరుగుటయే కారణమై యుండవోపును. ఏబది పడిలోంబడినాండు. ఆతనికి నన్నయ భట్టారకుండు ప్రారంభించిన మహాభారతమును బూర్తిచేయ వలెనను సంకల్పము చిరకాలమునుండి యుండెను. ఆ మహా కార్య నిర్వహణమునకు రాజకీయము లడ్డుగా నుండెను.

అంతేకాదు— యజ్ఞము చేయవలెననియు, సోమయాజివైన పిమ్మట రాజకీయములనుండి పూర్తిగ విముక్తుఁడై భారత రచనము సాగింపఁ దలఁచుచుండెను.

ఒకనాఁడు తిక్కనామాత్యుఁడు పెన్నేటిలో స్నాన మొనర్చి ప్రాతః కృత్యములఁ దీర్చుకొని యింటి కేతెంచెను. అతడింటికి వచ్చునప్పటికి కేతనకవి యరుగుపై గూర్చుండి యుండెను. కేతనను తిక్కన చూచి చాలకాలమైనది. తిక్కన హృదయమున వాత్సల్యము పెల్లుబికినది. కేతనను గాఢాశ్లేష మొనర్చి కూర్చుండఁ జేసినాఁడు. కుశలప్రశ్నాది కములైన పిమ్మట కేతన తిక్కనామాత్యునితో—

'గురువర్యులు నన్నేలకో స్మరించిరట! ఇంటివద్దనున్న పనులవలనఁ గొంత యాలస్యమైనది. క్షమింపవలె!'

'మించిపోయెడు రాచకార్యమేమియు లేదు. నీవు దశకుమార చరితమును రచించుచున్నట్లు వింటిని. అందలి నాలుగైదు పద్యములు సైతము వారువారుఁ జదువగా వింటిని. చక్కని శైలి యబ్బినది. ఆయుష్మంతుఁడవైన నిన్ను జూడ వేడుకకలిగినది.'

"పెద్దల యాశీర్వచనము! గురువులకు మాపైఁగల యభిమానమట్టిది!"

"నీవు సంస్కృతాద్యనేక భాషాకావ్యరచనా విశారదుఁడవు! లాక్షణికుఁడవు! నాకంటెఁ జిన్నవాఁడవైన నిన్నొక విషయ మర్థింపఁదలచితిని."

"అర్థించుటకాదు—ఆజ్ఞాపింపుఁడు!"

"కృతిపతిని నిశ్చయించితివా?"

"లేదు. తిక్కనామాత్యులు కృతి స్వీకార మొన ర్చుచో ధన్యుడ నగుదును!"

"మేము కోరునదియు నదియే!"

కృతిస్వీకారము నిశ్చితమైనది. రెండుమూడు దినము లందేయుండి కేతన స్వగ్రామమునకు బయలుదేరినాడు. కృతికర్తయగు తిక్కనామాత్యునకుఁ గృతిభర్తృత్వాకాంక్ష కలిగినది కాబోలును! ఏమైననేమి? కేతన దశకుమారచరిత్ర మును దిక్కనామాత్యుని కంకితముఁజేసి ధన్యుఁడైనాఁడు. తిక్కనామాత్యుని కోరికయు నెఱవేరినది.

ముదిమి సమీపించుచున్న కొలఁదియుఁ దిక్కనకు భారతరచనా విషయమునఁ దొందరయెక్కువైనది. ఎల్ల ప్పుడు నదియే యాలోచనము—"పవిత్రమైన భారత సంహి తను తెనుఁగు జేయుటకు ముందు యజ్ఞ మొనర్పవలెను. యజ్ఞమొనర్చి రాజకార్యములనుండి పూర్తిగ విరమించు కొనవలెను. అమాత్య పదవులు జన్మసాఫల్యము నొసఁగ జాలవు. రాజరాజనరేంద్రుని ప్రోత్సాహమున నన్నయ భట్టారకులచే బ్రారంభింపఁబడిన భారతము నేడు పూర్తి కావలెను. నన్నయభట్టారకులు ప్రారంభించునాటికున్న పరి స్థితులే నేడునున్నవి. నేడు శైవ వైష్ణవ భేదములు పెఱిగి పోయినవి. ఒకేవృక్షమునకవి రెండుశాఖలను విషయము ప్రజలు మఱచినారు. నేడు శైవ వైష్ణవ భేదములను రూపు

మాపవలసిన యగత్య మెంతేని గలదు. హరి హరాత్మక మైన పరబ్రహ్మ స్వరూపమును ప్రజలమానసమునఁ బ్రతిష్ఠింపవలెను. నా భారత శేషము కాహరిహరనాథుఁడే కృతికర్తకావలెను. అప్పుడే నీకిహాపరములు సిద్ధించును. "ఇట్లాతఁడెల్లప్పుడు భారతమును గుఱించియే యోచించుచుండెను. మనుమసిద్ధి భూపాలుఁడును తిక్కనామాత్యుల భావమెఱింగి వారిచే యజ్ఞము చేయించుటకు సన్నాహము లొనర్చెను. పెన్నేటియొడ్డున యాగశాలలు నిర్మింపఁబడినవి. దూరదూరములనుండి ఋత్విక్కు లనేకులే తెంచిరి. తిక్కనామాత్యులు యజ్ఞదీక్షితులైరి. నిరతాన్నదానములతో, నిరంతరాగ్నిహోత్రములతో, హోమములతో, పుణ్యకథాశ్రవణములతో యజ్ఞము సుసంపూర్ణమైనది. తిక్కనామాత్యు డిప్పుడు తిక్కన సోమయాజియైనాఁడు. అతని వాంఛితములలో నొకటి నెఱవేరినది. భారతరచనము మాత్రమే యింక మిగిలి యున్నది.

ఇట్లుండగా రాజకీయమైన విపత్తొకటి సంభవించినది. ఎఱ్ఱగడ్డసీమను నాఁడు కాటమరాజు పాలించుచుండెను. అతని సీమలో వర్షములు లేక పసుగ్రాసము కఱవైపోయెను. ప్రక్కన నున్న నెల్లూరిసీమలో వర్షములుపడి పశుగ్రాసము పుష్కలముగ నుండెను. అందుచే నాతఁడు మనుమసిద్ధి రాజ్యములో గొంతకాలముపాటు తన పసువులను మేపుకొనుటకును, అందుకై కొంత పుల్లరి చెల్లించుటకును నంగీకరించి యొప్పందము చేసికొనెను. కాటమరాజు పశువులు నెల్లూరిసీమను జేరినవి.

నిర్ణయించుకొనిన గడువునకు ముందే మెట్టగొండ ప్రాంతములందును, కనిగిరిసీమలోను, పల్నాడు నందును వర్షములు కురిసి నేల పచ్చబడెను. పశుగ్రాసమునకు లోటు తీరిపోయెను. అందుచే కాటమరాజు పశువులను దోలికొని రావలసినదిగా దన పశుపాలకుల కాజ్ఞయొసంగెను. మనుమ సిద్ధి పుల్లరి చెల్లింపకుండ పశువులను దోలికొని పోవుటకు వీలులేదని యడ్డగించెను. కాటమరాజు సైనికు లీవిషయము దమప్రభువున కెఱింగించిరి. ఆతఁడు పుల్లరి చెల్లించుట కంగీకరింపక మనుమసిద్ధితో యుద్ధమొనర్చి పశువులను దోలు కొని రమ్మని సైన్యమును బంపెను.

యుద్ధము తప్పనిసరి యగునట్లు కనిపించెను. మనుమ సిద్ధి తిక్కనామాత్యునితో సంప్రదించెను. ఆతఁడు యుద్ధము నకు సన్నాహమొనర్చుచు, ముందుగ సంధికై రాయబారము పంపుమనెను. అట్లే మనుమసిద్ధి అన్నంభట్టును కాటమరాజు వద్దకు పుల్లరి చెల్లింపవలసినదని రాయబార మంపెను. కాటమరాజు పుల్లరి చెల్లించుట కంగీకరింపక తన మందలో జాల పశువులు మరణించినవనియు, మనుమసిద్ధి తనకే నష్ట పరిహారము చెల్లింపవలెననియు తగవులు పెట్టెను. రాయ బారము విఫలమై యుద్ధము నిశ్చయమయ్యెను.

మనుమసిద్ధి తిక్కనామాత్యుని పెదతండ్రి కుమారు డును, తనకు దండనాథుఁడునైన ఖడ్గతిక్కనను బిలిచి కాటమ రాజును శిక్షించి పుల్లరి గొనిరమ్మని యాజ్ఞాపించెను. రాజాజ్ఞ ననుసరించి ఖడ్గతిక్కన సైన్యమును సమీకరించెను.

తిరునామాల తిప్పరాజు, శ్రీకంఠరాజు, పెదవేగి చొక్క- రాజు, పెదవరదరాజు, ఆదివన్నె మన్నెరాజు, అర్లకొండ అచ్చిరాజు, ఉదయాద్రి ఉమ్మయ్య, ఉర్లకొండ సోమన్న, చెన్నపట్టణము చంద్రశేఖరుఁడు, కాళహస్తి పాపతిమ్మరాజు మొదలుగాగల యోధులు మనుమసిద్ధి పక్షమున జేరిరి. వీరికి నాయకుఁడై ఖడ్గతిక్కన సేనలను నడుపసాగెను.

పలనాటి ప్రభువు పద్మనాయుడు, పల్లికొండ ప్రభువు చల్లా పిన్నమనాయుఁడు, వల్లభన్న, కరియావులరాజు, ముమ్మయనాయుఁడు మున్నగాగల యోధులు కాటమరాజు పక్షమువహించిరి. ఈసైన్యమునకు పిన్నమనాయనిమంత్రియు, నారాధ్య బ్రాహ్మణుఁడునైన బ్రహ్మరుద్రయ్య సర్వసైన్యాధి పత్యము వహించెను. ఇరుతెరగులవారికిని పాలేటి యొడ్డున నున్న పంచలింగాలవద్ద యుద్ధము జరిగెను.

ఆ యుద్ధమున మనుమసిద్ధి సైన్యము చాలభాగము నశింపగా ఖడ్గతిక్కన మాత్రము ధైర్యము వీడక యుద్ధ మొనర్చుచుండెను. అప్పుడు పిన్నమనాయుడు తిక్కనను జూచి యిట్లనెను—

పోరు నిలుపుమోయి భూసురోత్తముడ
సరిగాదు మాతోడ సమరంబుజేయ
అగ్రజుల్ మీరు యాదవులమేము
ఉగ్రము మామీద నుంపంగరాదు.

ఈమాటలు విని ఖడ్గతిక్కన మఱల సైన్యమును సమీకరించుకొని రావలెనని తలంచి పురమునకు వచ్చెను.

పట్టణములోనివారందఱాతనినిజూచి పరిహసింపసాగిరి. తండ్రి యైన సిద్ధనామాత్యుడు కుమారుని సంబోధించి యిట్లని నాఁడు—

రణరంగమున మోహరంబులు పొడగని
ప్రాణంబు దాచిన పంద గజమ !
విజయాధిపునిదాడి వెనుకొని తిరుగక
దెసతప్పివచ్చిన దిగ్గజంబ !
పోరజాలక యోడి మారుమాటల మాని
మంచాన కొఱగిన మత్తగజమ !
వెనుపల్లి చెఱువులో బిరుదులన్నియు రొంపిఁ
గ్రుంగంగ వచ్చిన కుంజరంబ !
నేడు మొదలుచేసి నెల్లూరిసీమలోఁ
బ్రగడతనము మాని మగిడి తఱలఁ
బూరిగఱచితిక్క! భూతంబుసోకినఁ
బాఱువానిరీతిఁ బందవైతి.

తండ్రి యొనర్చిన యుపాలంభమున కాతని హృదయము కెత్తినది. కాని కార్యసాఫల్యమే ప్రధానమని యెంచి యింటి కేఁగినాఁడు. భార్యయైన చానమ్మ నులక మంచముంచి దానిపై బసుపుముద్దపెట్టి స్నానమొనర్ప మనెను. అతఁడు భార్య చేసిన యవమానమునకు ఖిన్నుఁడుకాగా నామె యిట్లనెను—

పగఱకు వెన్నిచ్చినచో
నగరేనిను మగతనంపు నాయకులందున్

ముసురాఁడు హారమైలిమి
వగపేటికి జలకమాడ వచ్చినచోటన్?

ఈ యెకసక్కెముల నెట్లో సహించి లోనికేఁగి భోజనమునకుఁ గూర్చుండగా వీరమాతయైన ప్రోలమ్మ విఱిగిపోయిన పాలు వడ్డించి—

అసదృశముగ నరివీరుల
బసమీఱఁగ గెలువలేక పందక్రియ నీ
వసివైచి విఱిగివచ్చినఁ
బసులున్విఱిగినవి తిక్క! పాలున్విఱిగెన్.

అని పరిహసించినది. ఖడ్గతిక్కనకీ పలుకులు ములుకులు కాగా శీఘ్రమే కంచముముందునుండి లేచి కత్తిపట్టి మఱల యుద్ధక్షేత్రమున కేఁగెను. మహోగ్రకాల రుద్రుఁడై శత్రువులను చీల్చి చెండాడసాగెను. యాదవవీరులు సైతము ప్రాణములకు తెగించి పోరుచుండిరి. అకునేలా సంగ్రామమున మడసిరి. అప్పుడు పిన్నమనాయుడు ఖడ్గతిక్కననుగాంచి— 'మీరు భూసురోత్తములు. భూసురులకు యుద్ధముచేయుట విహితముకాదు. మిమ్ముఁ జంపినచో బ్రహ్మహత్యాదోషము వాటిల్లును. కావున మీరు తొలంగి చనుట మంచి'దనెను. అందులకు తిక్కన—'ఓయీ! యుద్ధమున కేతెంచి యీధర్మములేల? నీవు ధార్మికుడవేయైనచో పుల్లరి చెల్లింపక జననాశనమునకుఁ గారణమైన యుద్ధమునకేల సిద్ధపడితివి? నీకు చేతనైనచో నన్నుజంపి విజయముఁ బొందుము. కాదేని మా పుల్లరి చెల్లించిపొమ్ము" అనెను. ఇంతలో బ్రహ్మరుద్రయ్య

వచ్చి 'నేను బ్రాహ్మణుఁడను. నీవును బ్రాహ్మణుడవు. ద్వంద్వ యుద్ధమునకు రమ్మ'ని యాహ్వానించెను.

ఆయుద్ధమున ఖడ్గతిక్కన వీరస్వర్గ మలంకరించెను. ఆతని మరణమునకు జింతించుచు నొక కవి యిట్లనినాడు—

"ధైర్యంబు నీమేనఁదగిలియుండుటఁ జేసి
చలియించి మందరాచలము తిరిగె
గాంభీర్యమెల్ల నీకడనయుండుటఁ జేసి
కాకుత్థ్సుచే వార్థి కట్టువడియె
జయలక్ష్మి నీయురస్థలినె యుండుటఁ జేసి
హరిపోయి బలిదాన మడుగుకొనియె
ఆకారమెల్ల నీయందె యుండుటఁ జేసి
మరుఁడు చిచ్చునఁబడి మడిసిచనియె

తిక్కదండనాథ! దేవేంద్రపురికి నీ
వరుగుటెఱిఁగి నగము తిరుగుటుడుగు
నబ్ధి కట్టువిడుచు, నచ్యుతు కొదమాను
మరుడు మఱల కలుగు మగలరాజ!"

నందినిపుత్తెంచె నిందుశేఖరుఁడు నీ
వన్నయే తెమ్మ తారాద్రికడకు
గరుడునిపుత్తెంచె నరహరి రావయ్య
వడి సిద్ధతిక్క! కైవల్యమునకు
హంసనుఁబుత్తెంచె నజుడు నీకడకును
భయకులమిత్ర రాబ్రహ్మసభకు

నైరావతముఁబంపె నమరేంద్రుఁ డిప్పుడు
దినమున కేతెమ్ము తిక్కయోధ
యనుచు వేలువేలు సద్ధిలోఁ బిలువంగ
వారువీరుగూడ వచ్చివచ్చి
దివ్యయోగివైన తిక్కనామాత్యుండు
సూర్యమండలంబు చొచ్చిపోయె.

పిమ్మట మనుమసిద్ధి సైన్యసమేతుఁడై దండెత్తి యా యుద్ధముననే వీరస్వర్గమలంకరించెను.

ఖడ్గతిక్కన మనకవితిక్కనకు పెదతండ్రి కుమారుఁడు. అతని పరాక్రమ విశేషములు తెనుగునాట విశేషవ్యాప్తిలో నున్నవి. తిక్కన వంశమువా రెంతటి యోధులో, వారానాఁ డెట్టి యున్నతపదవులం దుండిరో, కొట్టరువువా రెంతటి దేశ భక్తులో తెలుపుటకే యీ గాథను విపులీకరింపవలసి వచ్చినది. వారి రాజభక్తి, దేశభక్తి యనన్య సామాన్యమైనది.

తిక్కనసోమయాజి రాజకీయములనుండి పూర్తిగ విరమించుకొని యుండుటచే నీ యుద్ధమున నాతఁడు ప్రత్యక్షముగ పాల్గొనలేదు. అతని దృష్టి యైహికములపైగంటె నాముష్మికముపై నెక్కువ లగ్నమై యుండెను. ఏ మనుమసిద్ధిని తాను నెల్లూరురాజ్యమునఁ బునఃప్రతిష్ఠించెనో యాతఁడు తన కన్నులయెదుట మడసినాఁడు. తన యున్నతికిని, తన వంశగౌరవమునకును గారణభూతుఁడైన పెదతండ్రి సిద్ధనామాత్యుఁడు పరమపదించినాఁడు. తనతోఁడివాఁడై మనుమసిద్ధికి సేనానియై రాజ్యమును వేయికండ్లతో గాపాడు

చుండిన పెదతండ్రి కుమారుడు తిక్కన పరస్వర్గ మలంకరించి నాఁడు. విధి యనుల్లంఘనీయము. పురుషకారము దైవము ప్రతికూలమైనపుడు వ్యర్థము. ఈ సంఘటనములవలన తిక్కన సోమయాజిలోని వైరాగ్యభావము స్ఫుటమయ్యెను.

అతని దేహస్థితితోబాటు క్షేత్రస్థితియును తారుమా రయ్యెను. ప్రజలలో సంకుచితభావము లేర్పడినవి. శైవ వైష్ణవ భేదములు ముదిరి మతకలహములు మెండయ్యెను. ప్రజలు ధర్మస్వరూపమును గుర్తింపలేక యధర్మమార్గావ లంబకులైరి. ఈస్థితి తిక్కన సోమయాజికి సహింపరానిదైనది. అజ్ఞానాంధకారమున, సంకుచిత భావములతోఁ గొట్టుమిట్టాడు చున్న ప్రజలకు ధర్మమార్గమును ప్రబోధించి యుద్ధరింప వలసిన తరుణ మాసన్నమయ్యెను. ఏపరిస్థితులందు నన్నయ భట్టారకులు భారత రచన మారంభించిరో యట్టిపరిస్థితులే నేడును దాపురించినవి. ప్రజల నుద్ధరించుటకు పంచమవేద పరివర్తనముదక్క గత్యంతరములేదు. ధర్మాద్వైత స్థితిని పాదుకొల్పుట కదియే మార్గము. ఇక విలంబనము పనికిరాదు. సోమయాజి తన యభీప్సితసిద్ధికై హరిహరనాథ స్వరూపుఁ డైన పరతత్త్వమును స్తుతించినాడు—

శ్రీయన గౌరినాఁబరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముఁదాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

అని యిట్లు ప్రార్థించి యొకనాటి రేయి సోమయాజి నిద్రింపగా నాతనికి తండ్రియైన కొమ్మనామాత్యుఁడు స్వప్నమున సాక్షాత్కరించెను. తిక్కన పులకిత గాత్రుఁడై తండ్రికి నమస్కరించి దోసిలియొగ్గి నిలువఁబడి యుండెను. కొమ్మనామాత్యుడు కుమారుని దీవించి కరుణార్ద్ర దృష్టితో జూచి "వత్సా!

కిమస్థిమాలాంకిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కింకాలకూటః కిమువా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే.

అని నీవు తొల్లి రచించిన శ్లోకమును గాఢాదరంబున నవధరించి భక్తవత్సలుండైన హరిహరనాథుడు నీదెస దయాళుండై యునికిం జేసి నిన్నుఁ గృతార్థునిఁజేయఁ గార్యార్థియై నాకలోక నివాసినగు నాకుఁ దన దివ్యచిత్తమునం గల కారుణ్యంబు తెలంగెలుంగు శక్తిం బ్రసాదించి నన్ను నాకర్షించి కొలిపించుకొని వీడెవిజయం చేయుచున్నవాఁడు. చూడుము!" అనెను.

తిక్కన సంభ్రమాశ్చర్య సంభృతాంతరరంగుడై చూచునప్పటికి——

కరుణారసము పొంగి తొరగెడు చాడ్పున
శశిరేఖ నమృతంబు జాలువాఱ
హరినీల పాత్రిక సురభిచందనమున
గతినాభి ధవళ పంకజము మెఱయ

గుఱియైన చెలువున నెరసిన లోకర
క్షణమనంగ గళంబుచాయదోపఁ
బ్రథమాద్రిదోతెంచు భానుబింబమునాను
రమ్మైన కౌస్తుభ రత్నమొప్ప

సురనదియును గాళిందియు బెరసినట్టి
కాంతిపూరంబు శోభిల్లు శాంతమూర్తి
నామనంబు నానందమగ్నముగఁజేయ
నెలలమి సన్నిధిసేసె సర్వేశ్వరుండు.

తిక్కనసోమయాజి హరిహరరూపాత్మకమైన పరబ్రహ్మమును గాంచి దండప్రణామంబాచరించి వినయావనతుఁడై సంభ్రమాశ్చర్య సంతోషములు ముప్పిరిగొన పులక పటల పరికవితాంగుడై దోయిలి ఘటించి నిలువబడి యుండెను. అప్పుడా పరమాత్మ చిఱునగవున నాతనిని విలోకించి యిట్లనెను.

వైదిక మార్గనిష్ఠమగు వర్తనముందగ నిర్వహించుచున్
భేదములేని భక్తి నతినిర్మల వృత్తిగఁ జేయుచుండి మ
త్పాద నిరంతర స్మరణ తత్పరభావము కల్మినాత్మ స
మ్మోదముఁబొంది కావ్యరసముంగొని యాడుచునుండు
దెప్పుడున్.

అందును,

క. పారాశర్యుని కృతియయి
భారతమనుపేరఁ బరఁగు పంచమవేదం

పారార్థ్యము పరికింపఁ ద
ద్గౌరవ మూహించి నీవఖండిత భక్తిన్

తే. తెనుఁగుబాసవి నిర్మింపఁ దివుటయయ్యె
భవ్యపురుషార్థ తరుపక్వ ఫలముగాదె
దీని కెడనియ్యకొని వేడ్కనూని కృతిప
తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ.

హరిహరనాథుని వచనము లాలకించి తిక్కనసోమయాజి వినయవినమిత గాత్రుఁడై ముహుర్ముహుః ప్రణామంబు లాచరించి, నిటలతట ఘటితాంజలుఁడై. "దేవా! ధన్యుఁడను! మీ సంపూర్ణ కృపాకటాక్షమును నాపైఁ బ్రసరింపఁజేసి నన్ను ధన్యు నొనర్చితిరి. తమయాదేశమును శిరసావహించి జన్మమును సఫలమొనర్చుకొందును." హరిహర నాథుఁడు సంతుష్టాంతరంగుఁడై తిక్కనను దీవించి యంతర్హితుండయ్యెను. నిద్రనుండి మేల్కాంచి తిక్కన సోమయాజి తానుగన్నకల తెఱంగు విచారించి యాశ్చర్య చకితుఁడయ్యెను. హరిహర కృపాకటాక్షముగూడ దనపైఁ బ్రసరించినందులకు సంతసించి భారతరచనమునకు శుభముహూర్తము నిర్ణయించుకొనెను.

ఒక్క యనుమాన మింకను దిక్కన సోమయాజిని పట్టిపీడించుచున్నది— "నన్నయభట్టారకులు భారతాంధ్రీకరణమును బ్రారంభించిరి. అరణ్యపర్వ మధ్యమున నే యది యాగిపోయినది. నన్నయభట్టారకులు వదలిపోయిన అరణ్యపర్వశేష మాదిగాఁ బ్రారంభించుటయా, లేక అరణ్యపర్వమును వదలి విరాట మాదిగా రచించుటయా? అరణ్యపర్వ

మునసేదో దోషమున్నదనియు, నాకారణముననే యరణ్య మధ్యమున నన్నయభట్టారకులకు మతిభ్రమ కలిగి మరణము సంభవించెననియు జనప్రవాదమున్నది. నన్నయభట్టారకుల మృతితో నంటువడియున్న యరణ్యపర్వమును స్పృశించు టెంతవఱకు? అరణ్యపర్వశేష విషయము పిమ్మటఁజూచు కొనవచ్చును. ముందు విరాటపర్వము నారంభింతము.''

తిక్కన సోమయాజి యిట్లు నిశ్చయించుకొని శుభ ముహూర్తమున భారతరచనమున కుపక్రమించెను. భారత గాథ ప్రసిద్ధిఁజెందినదే! తాను వ్యాసభారతము ననేక పర్యాయములు చూచియే యున్నాఁడు. కథాసంవిధానమునకై వెదుకనక్కఱలేదు. తానాశుకవితా విశారదుఁడు. వ్యాస భారతమునకు యథాతథానువాదము నాతఁడు లక్షింపక నన్నయ మార్గమునే యనుసరింపఁ దలచెను. వలసినచోట్ల మాతృకను జూచుచుఁ దానాశువుగఁ జెప్పుచుండ వేగముగ లిఖించుటకొక లేఖకుఁడు కావలసివచ్చెను. లేఖకుఁడు సామాన్యుఁడు పనికిరాఁడు. ఒకసారి చెప్పిన పాదమును మఱల నడుగకుండ వ్రాయవలెను. ఆతఁడు వ్రాయులోపల కవి రెండవ పాదము నల్లును. లేఖకుఁడు పండితుఁడై కవి హృదయము నెఱింగినవాఁడై యుండవలె. ఎందేని ప్రమాదమున యతి ప్రాసాదులు కుదరనిచో సరిచేసి వ్రాసి వినిపింపవలెను. అట్టి లేఖకుఁడు కుదిరినచోఁ గవికార్యము కొంత తేలిక యగును. వ్యాసభగవానునకు గజాననునివలెఁ దనకును నొక లేఖకుఁడు కావలెను. తమ శిష్యుఁడును, విద్వాంసుఁడునైన కుమ్మర గురునాథుని లేఖకునిగ నియమించుకొని భారతరచనమున కుపక్ర

మించినాఁడు. సోమయాజి తానాశువుగ పద్యము లల్లు చుండును. గురునాథుఁడు వానిని తాటియాకులపై లిఖించు చుండును. భారతకథ జగత్ప్రసిద్ధమైనది. కథాసంవిధానము నకై శ్రమపడనక్కరలేదు. పూర్వాపర సందర్భములను పొసగించుటకై పాటుపడ నక్కరలేదు. కాని తిక్కన భారత రచనమునఁ గొన్ని నియమములను గల్పించుకొనెను.

సంస్కృతభారతమును యథాతథముగ తెనిగించుట ఆతని కిష్టములేదు. అనవసరములని తోఁచిన భాగములను విడచిపెట్టియు, రసవత్తరములైన ఘట్టములను పెంచియు, నీరసములైన విషయములకు కావ్యగౌరవ మొడగూర్చియు స్వేచ్ఛగ భారతరచనము సాగింపవలెనని నిశ్చయించు కొనెను. అట్లే తిక్కన మూలభారతమును జూచుచు నందలి కథను మాత్రమే గ్రహించి తనభావనా బలమున దానిని స్వీయమొనర్చుకొని తన ప్రతిభావ్యుత్పత్తులు ప్రస్ఫుటము లగునట్లు పద్యములు చెప్పుచుండ గురునాథుఁడు లిఖించు చుండెను. పద్యము పూర్తిగ వ్రాసిన పిమ్మట గురునాథుని చదువమనును. ఆతఁడు చదువగా వలసినచో మఱల సంస్క రించును. ఒక్కొక్కప్పుడు వెనుకటి ఘట్టములను సైతముఁ జదువమనును. అందలి పద్యములు ప్రస్తుత ఘట్టమునకు సరిపోయినచో వలసిన మార్పులను స్వల్పముగచేసి పూర్తి చేయును. అంతేకాదు; తన నిర్వచనోత్తర రామాయణము నందలి వర్ణనలు ప్రస్తుత భారతకథా వర్ణనమునకు సరిపోలుచో గొన్నిపాదము లట్లే భారతమున చొప్పించును. ఈవిధముగ

భారత రచనము శరవేగమున సాగిపోవుచుండెను.

సోమయాజికి గ్రాసవాసోదైన్యములు లేవు. కావలసినంత యాస్తియున్నది. మనుమసిద్ధియొసంగిన భృత్యులున్నవి. గణపతి దేవుఁడొసంగిన గ్రామము లెనిమిదియున్నవి. కుమారుఁడు కొమ్మన చేతికందివచ్చి సంసారభారమును నిర్యహించుకొను చున్నాడు. సోమయాజికి అగ్నిహోత్రములు, మహాభారతము తప్ప వేఱొకటి పట్టదు—పట్టించుకొనడు. ఆతఁడెల్లప్పుడును భారతముగూర్చియు, నందలి పాత్రల మనస్తత్వమును గూర్చియు, పాత్రపోషణా విధానమును గూర్చియు, కథాసంధానము, కథాకథనములనుగూర్చియు నాలోచించుచుండును.

ఉదయమే లేచి పినాకినీ జలముల స్నానమొనర్చి సంధ్యాద్యనుష్ఠానములుఁ దీర్చుకొని భారత రచనమున కుపక్రమించును. కుతపకాలమునకు భారత రచనమును నిలిపివేసి వైశ్వదేవమొనర్చి, యగ్నిహోత్రుని ప్రీతుంజేసి దేవ పితృ తర్పణాదికములు నిర్వహించి భుజించి యించుక విశ్రమించును. మూఁడుజాములవేళకు గురునాథుఁ డేతెంచును. గురునాథుడు చదువగా సోమయాజి తాను రచించిన పద్యములను విని వలసిన మార్పులొనరించును.

తిక్కనసోమయాజి భారతరచన చేయుచుండిన విష లోకమునఁ బ్రాకెను. పలువురు కవులు పండితులు తిక్కన వద్దకేతెంచి విని పోవుచుండిరి. కొంతమంది తిక్కనసోమయాజి సామాన్యవృత్తములే వాడుచున్నాఁడనియు, ఆతనికి

విశేష వృత్త పరిజ్ఞానములేదనియు చాటున విమర్శింప సాగిరి. సోమయాజి యీ విమర్శనమునువినియు విననట్లూరకుండెను. చివరి పర్వములలో విభిన్నవృత్తములను రచించి తన సామర్థ్యమును జూపనెంచెను. మరిమి మీాదఁబడుచున్న కొలఁదియు సోమయాజికి భారతమును శీఘ్రముగ పూర్తిచేయవలెనను తొందఱ యెక్కువయ్యెను.

పంచమవేదమునకుఁ బ్రాణభూతమై, వేదాంతసర్వస్వమైన భగవద్గీత లుపదేశింపఁబడిన ఘట్టమువచ్చినది. తిక్కన సోమయాజి యొకటి రెండుదినములు రచనావ్యాసంగమునాపి తనలో దానిట్లు వితర్కరించుకొనినాఁడు.

"శ్రీకృష్ణభగవానునిచే నర్జునునికుపదేశింపఁబడిన భగవద్గీత కేవలము వేదాంత ప్రతిపాదకము. అద్వైత ప్రతిపాదకమేయైనను, సామాన్యజనులకు దురవగాహము. సామాన్యేతిహాసమున నిట్టి దీర్ఘమైన వేదాంతగ్రంధము కథాగమనమునకించుక ప్రతిబంధకముగనుండును. ఆంధ్రమహాభారతము రసప్రధానమైన ప్రబంధముగా సాగిపోవుచున్నది. సంస్కృత భారతమును యథాతధముగ ననువదించుటలేదు. కావున నీ ఘట్టమునుగూడ కథాగమనమున కడ్డుతగుల కుండునట్లును, కావ్యకళాసృష్టికి ప్రతిబంధకముగాని విధమునను సంక్షేపించి చెప్పుట యొప్పునేమో! భగవద్గీతలను బూర్తిగ నుపేక్షింపను టయుఁదగదు. అందుచేత భగవద్గీతయందలి యధార్థము

ములలో సారభూతములైన శ్లోకములను మాత్రమే తెనిగించి ముందునకు సాగిపోవుట యుచితముగానుండును. విద్వాంసుల కొఱకు భగవద్గీతలను దెనుగులో జెప్పవలసిన పనిలేదు. పామరులకు వేదాంతవిషయములు తెనుగులో జెప్పినను సంస్కృతమున జెప్పిననునొకటే! సామాన్యజనుల కుపాఖ్యానాదికములద్వారా ధర్మబోధ చేయుట తగును. గాని కేవల వేదాంతోపదేశము వారి మనసులకు బట్టదు. భగవద్గీతలందలి కర్మయోగ, భక్తియోగ సాంఖ్య యోగజ్ఞాన యోగాదుల విభిన్నత్వములో సూక్ష్మముగ నంతర్నిహితమైయున్న ధర్మైక్యతను వారు గుర్తింపజాలరు. అందుచేత సంక్షేపించి చెప్పుటయే యుక్తము.''

ఇట్లు చింతించి తిక్కనసోమయాజి భగవద్గీతాసారమును సంగ్రహించి చెప్పి ముందునకుసాగెను. సోమయాజి యీవిధముగ మూలమునకు మెఱుగులు వెట్టుచు, నీరసఘట్టములకు కావ్యత్వ గౌరవ మాపాదించుచు, వ్యర్థములనితోచిన వానిని పరిహరించుచు, ప్రజలకు ధర్మబోధకములైన యుపాఖ్యానములను గొన్నిటిని పెంచుచు, భిన్నవ్యక్తుల మనస్తత్వములను యథోచితముగ చిత్రించుచు భారత సంహితను పంచమ వేదముగా, ఇతిహాసముగా, కావ్యముగా, ధర్మశాస్త్రముగాఁ దోచునట్లు పూరించి తన జన్మమును సార్థకమొనరించుకొని హరిహరనాథునిలో లీనమైపోయెను.

తిక్కనసోమయాజి భౌతిక శరీరములేదు. కాని ఆంధ్ర మహాభారత మున్నంతకాలము, ఆంధ్రజాతి మనినంతకాలము, ఆంధ్రభాష యున్నంతకాలము తిక్కన సజీవుడే!

"వాచా మాంధ్రమయీనాం యః
ప్రవక్తా ప్రథమోభవత్
ఆచార్యం తం కవీంద్రాణామ్
వందేవాగను శాసనమ్."

"శ్రీవాణీ గిరిజాశ్చిరాయదధతో వక్షోముఖాంగేషుయే
లోకానాంస్థితిమావహన్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తేవేదత్రయమూర్తయస్త్రిపురుషాస్సంపూజితావస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజ భవశ్రీకంధరాశ్శ్రేయసే."

అది శాలివాహన శకము 944 వ సంవత్సరము. శ్రావణబహుళ ద్వితీయా గురువారము. క్రీస్తుశకము 1022 వ సంవత్సరము జులై నెల పంధొమ్మిదవ తేదీ. విమలాదిత్య తనూభవుఁడైన రాజరాజనరేంద్ర విష్ణువర్ధనుఁడు వేంగీ రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. నాటికి వేంగీరాజ్యము నకు రాజధాని రాజమహేంద్రవరము. పూర్వపు రాజధాని వేంగీనగరము.—హేలాపురము (ఇప్పటి ఏలూరు) న కుత్తర మున నుండిన గొప్ప పట్టణము. రాజ్యమునకు రాజధాని మధ్యగా నుండవలెనని రాజమహేంద్ర బిరుదాంచితుఁడైన అమ్మరాజు రాజధానిని మార్చెను. ఆతని పేరనే రాజధానికి రాజమహేంద్రపురమను పేరు కలిగినది. నాటినుండియుఁ దూర్పుచాళుక్యుల కదియే రాజధాని.

రాజరాజనరేంద్రుని రాజ్యాభిషేకముతో నాంధ్ర సామ్రాజ్యమునకు మంచి రోజులారంభమైనవి. తూర్పు చాళుక్యరాజు లందఱును ప్రజానురంజకులైన రాజులే ! కవి పండిత వాఙ్మయ పోషకులే! విశేషించి వేదమతోద్ధారకులే! వారందఱిలోనను రాజరాజు నాయకరత్నము. ఆతని కాల మున వేంగీరాజ్యము మూడు పూవు లాఱు కాయలుగ వృద్ధినందినది.

తూర్పుచాళుక్యులు చంద్రవంశజులు. వారందఱును వేదమతానుయాయులు. భూదేవకులాభి రక్ష[illegible] [illegible]

ప్రీతులు. నానాపురాణ శ్రవణాసక్తులు. విశుద్ధచారిత్రులు. నానామఖవ్రత దాన ప్రవణానురక్తులు."

ఈ చాళుక్య ప్రభువు లందఱికిని విష్ణువర్ధనుఁ డనునది బిరుదనామము. వీరి మూలపురుషుఁడు విజయాదిత్యుఁడు. అయోధ్యానగరాధిపతియై దక్షిణదేశముపై దండెత్తివచ్చెను. త్రిలోచనపల్లవునితో జరిగిన యుద్ధమున నాతఁడు నిహతుఁ డయ్యెను. అప్పటి కాతనిభార్య గర్భవతియై యుండెను. ఆవిపత్సమయమున విష్ణుసోమయాజి యామెను గొంత పరివారముతో గొంపోయి ముదివేము గ్రహారమున దన యింటిలోనే యుంచి పోషించుచుండెను. ఆమె మగశిశువును గనెను. ఆ యగ్రహారవాసు లంతకుఁ బూర్వము సోమయాజి నెఱుగరు. ఆతడు రాజపత్నిని తన కుమార్తెయని చెప్పి యామెకు బుట్టిన బాలుని తన మనుమఁడని చెప్పి పోషించుచుండెను. రాజవంశాంకురమును నాశన మొనర్చుటకై త్రిలోచనపల్లవుని చారులు తిరుగుచు విష్ణుసోమయాజి యింటనున్న బాలుని జూచి యనుమానించిరి. వారి యనుమానమును పోగొట్టుటకై సోమయాజి యాబాలునితో గలసి యొక కంచములో, రాజపత్ని వడ్డింపగా భుజించి వారి యనుమానముఁ దీర్చెను. సోమయాజి క్షత్రియునితో గలసి భుజింపఁడుగదా! వారదినమ్మి వెడలిపోయిరి.

సోమయాజి యా బాలునికి రాజోచితములైన జాతకర్మాదులు నెఱపి విష్ణువర్ధనుఁడని పేరుపెట్టి పెంచెను. అతనికి రాజోచిత విద్యలన్నియు నేర్పి యప్పుడాతని జన్మరహస్య

మును బయటపెట్టెను. ఈలోగా సోమయాజి యాటవికులను ద్రోగుచేసియు, కదంబగాంగులను వంచియు విష్ణువర్ధనుని పాలము క్రిందికిఁ దెచ్చెను. పిమ్మట విష్ణువర్ధనుడు నర్మద మొదలు సేతువు వఱకునుగల దేశమునకుఁ బ్రభువయ్యెను. నాటినుండియు విష్ణుసోమయాజిచేఁ బెంపబడిన వారగుటవలన నాతనిపైగల భక్తిప్రపత్తులతో విష్ణువర్ధన నామముఁదాల్చిరి. రాజరాజనరేంద్రుఁడును నట్లే విష్ణువర్ధననామమునుధరించెను.

రాజరాజు రాజ్యమునకు వచ్చునప్పటికి రాజ్యపరిస్థితు లల్లకల్లోలముగ నుండెను. మత సాంస్కృతిక విషయమున నీ కల్లోల మధికముగ నుండెను. ఉత్తరమునబుట్టిన జైన బౌద్ధ చార్వాకమతములు అచ్చట నంతరించి నామమాత్రావ శిష్టమైయున్నను దక్షిణమున, ముఖ్యముగ నాంధ్రదేశమున విపుల ప్రచారములోనుండెను. ఈ మతములవలన సామాన్య ప్రజలు కింకర్తవ్యతా మూఢులైపోయిరి. వారికేది మతమో ఏది యనుసరణీయమో తెలియదు.

భిన్నమతమతానుయాయులుచెప్పువిభిన్నపరస్పర విరుద్ధ ములైన మాటలవలన సామాన్య జనుల కేమిచేయుటకును దోచని పరిస్థితియేర్పడినది. అంతేకాదు కేవలమతవ్యాప్తితో దృప్తిఁజెందక జైనబౌద్ధాది మతములు రాజకీయములలో జోక్యముకల్గించుకొని పరిపాలనా వ్యవస్థ నల్లకల్లోలము జేయు చుండెను. ప్రజాహితైషియగు రాజరాజీయవ్యవస్థనుండి దేశమును రక్షింప బద్ధకంకణుఁడయ్యెను.

అతఁడొకనాఁడు ధర్మాసనమునుండి జైనబౌద్ధమతానుయాయుల యభియోగమును తీర్చి పంపివేసెను. కులగురువైన నన్నయభట్టు, పితృసమానుఁడై యధిక గౌరవపాత్రుఁడైన నారాయణభట్టు మున్నుగాఁగల కవిపండితులు నమాత్యులు గూర్చుండియుండ వారితో నిట్లనెను. "చూచితిరిగదా రాజ్యస్థితి! మతకలహములు మెండై ప్రజాజీవనము దుర్భరమై పోవుచున్నది. దీనికేదో నొక యుపాయ మాలోచింపుఁడు."

సభలోఁ గొంత చైతన్యము గలిగినది. అమాత్యులు సేనాపతులు రాజు ముఖముఁజూచిరి. ఆతనిమోము చింతావ్యగ్రమైయుండెను. హృదయసంక్షోభమంతయు ముఖమున ప్రస్ఫుటమగుచుండెను. అమాత్యవర్గ మేకగ్రీవముగ జైన బౌద్ధులను రాజ్యమునుండి వెడలగొట్టవలెననిరి. మరికొందరు వారి సంఘారామములను నాశనమొనర్చి బహిష్కరింప వలెననిరి.

రాజరాజు నన్నయదిక్కు మొగంబై "గురువర్యా! మీ యభిప్రాయమేమి?" యని యడిగెను.

"రాజకీయములు మాకంతగాఁ దోపవు. జైన బౌద్ధ చార్వాకాది మతఖండన మావశ్యకమే! లేనిచో వేదమతమునకు గొప్పహాని సంభవించును. జైనులు, బౌద్ధులు, చార్వాకులు నమాయకులైన ప్రజలను తప్పుత్రోవను బట్టించి యల్లకల్లోల మొనర్చుచున్నారు. వారి యాటలు కట్టింప వలసినదే! మఱి నారాయణ భట్టాచార్యుని యుద్దేశ్యమేమో?"

డుసెను. రాజరాజు నారాయణభట్టువైపు సాభిప్రాయముగ జూచెను.

నారాయణభట్టిట్లనెను—"ప్రభూ! జైన బౌద్ధ చార్వాకాది మతములను, ఆ మతానుయాయులను హింసించి బహిష్కరించినచో లోకమున మన కపకీర్తి వచ్చును. దుర్యశము రాజునకు క్షేమముకాదు. మతము పేరుతో రాజ్యమున విప్లవమును, కల్లోలమును రేపువారిని కఠినముగ శిక్షించుటలో తప్పులేదు. పరమత దళనముకంటె స్వీయమత ప్రచారమునకు, నభివృద్ధికిఁ బ్రయత్నించుట మంచిది."

"దాని కుపాయమును సైతముఁ బలుకరింపుడు."

"ఈ నూతన మతములన్నియుఁ బ్రజలతో నత్యధిక సంబంధమును స్థాపించుకొనుచున్నవి. వేదమతము నందలి దౌర్బల్యముల నధికముగఁ బ్రచారమొనర్చి తమ కనుకూలముగ వ్యాఖ్యానించుచున్నారు. నిరక్షరాస్యులైన పామరులు వారి మాటలను నమ్ముచున్నారు. దేశభాషలో వారు రచించిన గ్రంథములు పామర జనాకర్షములై ప్రచారముఁ బొందుచున్నవి. కావున ప్రభువులు వేదమత ప్రచారము నధిక ప్రయత్న మొనరించుట లెస్స."

"వేదములను పామరులందు ప్రచారమొనర్చుటెట్లు?"

"వేదములను ప్రచారమొనర్ప నక్కరలేదు. వేదములందు జెప్పఁబడియున్న ధర్మములను ప్రచార మొనర్ప వలెను. అట్లొనర్పవలెనన్న దేశభాషలో నాయా ధర్మములు ప్రబోధింపబడ వలెను. సామాన్యులకు సంస్కృత

మందుపాటులో లేదుగదా! వేదమత ప్రతిపాదకులులైన పురాణేతిహాసములు తెనుఁగులోని కనువదింపవలెను. వైదిక కర్మకాండలను, యజ్ఞయాగాది క్రతువులను ప్రోత్సహింప వలెను.

"మీరు చెప్పిన యుపాయములు బాగున్నవి. నేటి నుండి మా లక్ష్యమదియే యగును. నన్నయభట్టారకులచే జేయఁబడు యజ్ఞమే యీ కార్యక్రమమునకు నాంది యగు గాక! గురువర్యా! వేదాధ్యయన సంపన్నులును, బహుశాస్త్ర పురాణ కోవిదులును, విశేషించి రాజగురువులునైన తాను యజ్ఞ మొనర్చి మమ్ములను, మా రాజ్యమును పవిత్రులఁ జేయవలెను. మనరాజ్యమున నీక్రతువులు నిరంతరాయముగ నాగుచుండవలెను. ఎవరు యాగ మొనర్ప సంకల్పించినను రాజధనాగారమునుండి సాయము లభించును."

పవిత్రగోదావరీతీరమున నన్నయభట్టారకుల యాగము సుసంపన్నమైనది. చుట్టుప్రక్కల నీ యాగముతో గొంత యుత్సాహ మినుమడించినది. అచ్చటచట వేంగీరాజ్యములో యజ్ఞ యాగాది క్రతువులు ప్రారంభమైనవి. ఎచ్చట క్రతువు జరిగినను రాజసహాయము లభించుచున్నది. అంతేగాదు. విమతస్థులైన దుండగుల బారినుండి రక్షించుటకు రాజరక్షణము సైతము లభించినది. కర్మకాండల కితోధిక ప్రోత్సాహము లభించినది.

ఒకనాడకస్మాత్తుగ రాజసన్నిధికి రావలసినదని నారాయణభట్టునకు వర్తమానము వచ్చినది. నారాయణభట్టు

రాజసన్నిధికి బయలుదేరెను. రాజరాజప్పుడు తన భవనమున నాలోచనాధీనుఁడై పచారు లొనర్చుచుండెను. నారాయణ భట్టునుగాంచి రాజరాజు నమస్కరించి యాతనిని గూర్చుండఁ జేసి తానును గూర్చుండెను.

"హారీతులకుఁ గుశలమా? మీరు పలుకరించిన యుపాయము వ్యర్థముకాలేదు. రాజ్యమున వేదకర్మల ప్రాచుర్యము కాన్పించుచున్నది."

"ప్రభువులకు మాపైఁగల కృపాకటాక్ష మట్టిది!"

"కాదు! హారీతుల కీచాళుక్యులపైగల దయ యట్టిది! నాఁడు విష్ణుసోమయాజుల కరుణాకటాక్షమే లేనిచోఁ జాళుక్యులే లేరుగదా! చాళుక్యులేగాదు ఆంధ్రదేశమే విష్ణుసోమయాజులకు ఋణపడి యున్నది. మేమా ఋణమును దీర్చుకొనవలెనన్న హారీతులను బూజించుటకంటె గత్యంతరము లేదు. అది యటుండనిండు. వేదమత ప్రచారమునకు మన మొనర్పఁదగిన కార్యమేమో తెల్పుఁడు."

"సమస్త ధర్మములకు నెలవై, పంచమవేద మనబఱగిన భారతసంహితను దెనుగులోనికిఁ దేవలెను. దేశభాషలో సామాన్యజనులు తమ ధర్మమును తెలిసికొనఁ గల్గినచో స్వీయ ధర్మముపై వారి కభిమానము కలుగును. పరమతములవైపు తేలికగ నాకర్షింపఁబడరు. అంతేగాదు, భారతము ధర్మపరాయణులైన పాండవుల చరిత్ర. చంద్రవంశజులైన ప్రభువుల వంశచరిత్రము! కాన నద్దానిని దెనిగింపఁ జేయుట ప్రభువుల కర్తవ్యము."

"అహో! ధన్యుఁడను. భారతాంధ్రీకరణమునకుఁ బూనుకొని నన్ను ధన్యునొనరింప మీరే సమర్థులు. నా యభ్యర్థనమును మన్నింపవలె."

"ప్రభువులు మఱచినారు. రాజగురువులు, రాజపురోహితులు, విశేషించి సోమయాజులునైన నన్నయభట్టారకులే పంచమవేదము నాంధ్రీకరింప నర్హులు. వారినిశాదని యా గౌరవము నాపై నిడుట యుచితము కాదు."

"అట్లయిన నన్నయ భట్టారకులనే ప్రార్థింతము. నా యభ్యర్థనమును త్రోసిపుచ్చరనునమ్మకము నాకున్నది."

"త్రోసిపుచ్చుటకిది రాజకార్యమే కాదు. దైవ కార్యము, ధర్మకార్యము!"

నాడు రాజరాజనరేంద్రులు సభాభవనమున గొలువు దీఱియుండిరి. నన్నయభట్టు, నారాయణభట్టు, చీదమార్యుడు, లేఖకుడు గండాచార్యుఁడు మున్నగువా రుచితాసనముల నాసీనులై యుండిరి. రాజరాజు నన్నయభట్టువైపు సాదరముగ వీక్షించి యిట్లనిరి—

"గురూత్తమా! చీదమార్యుల కిచ్చిన దానశాసనము పూర్తియైనదా!"

"చిత్తము! శాసనము లిఖించి గండాచార్యుని కొప్పగించినాను. వారు దానిని సిద్ధమొనర్చు చున్నారు."

"కులగురువుల నొక్క-విషయ మర్థించుచున్నాను."

"ప్రభువుల యనుగ్రహము!"

"మావంశరక్షకులైన భూసురులయెడ మాకున్న యభిమానము మీరెఱుంగుదురు. వేదమత ప్రచారమునెడ మాకుగల నాశక్తియు మీరెఱుంగనిదికాదు. భారత శ్రవణా శక్తియు, పార్వతీపతి పదాబ్జ ధ్యానపూజా మహోత్సాహ మును, మా కులపతు లెఱింగియే యున్నారు. మా చంద్ర వంశమునకు పురుచక్రవర్తి, పాండవేయులు వంశకర్తలని విని యున్నాను. విమలసద్గుణ శోభితులైన పాండవుల చరితమును వ్యాసరచితమైన దానిని మీరు వినిపింపగా విని యున్నాము. ఆభారత సంహిత నాంధ్రభాషలోని కవతరింప జేయవలె నని సంకల్పము గలిగినది. ఆ సంకల్పమును గార్యరూపమునఁ బెట్టి మమ్మనుగ్రహింపవలె."

ఈ మాటలకు నన్నయభట్టారకుఁ డులికి పడినాఁడు. ఇంచుక తేరుకొని—"ప్రభూ! ఇయ్యది కష్టసాధ్యమైనపని. నావలన నగునో కాదోయని సంశయము కలుగుచున్నది. ఉదాత్తచరిత్రమైన భారతగాథను—వ్యాసరచితమైన భారత మును దెనిగించుట సామాన్యముకాదు... ఈపనికి నాకంటె సంస్కృతాంధ్ర కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్ర భాషాకవి రాజశేఖరులు..."

నన్నయభట్టు మాట పూర్తికాకముందే రాజరాజు "నారాయణభట్టులు సమర్థులే! మీరు మాత్రము తక్కువ వారా? ఈ కార్యభారము మీరు వహింపకతప్పదు. మీపేరనే యాంధ్రమహాభారతము వెలయువలెను."

"చిత్తము! కవీభ వజ్రాంకుసుడును, అష్టాదశావ ధాన చక్రవర్తియును, నాకు సహాధ్యాయియునైన [illegible]రా

యణభట్టు సాయమున్నచోఁ దప్పక నిర్వహింపగలనను ధైర్యమున్నది.''

రాజరాజు నారాయణభట్టువైపు జూచెను. నారాయణభట్టు — "నా సాయమునకై ప్రత్యేకముగ నడుగ నక్కరలేదుగదా? రాజాజ్ఞ నిర్వహణమున మీకుగల బాధ్యత నాకుమాత్రము లేదా?'' యనెను.

వెంటనే రాజరాజు కర్పూర జాంబూనదాంబరాదుల దెప్పించి నన్నయకుఁ దాంబూలమిచ్చిరి.

'ధన్యోస్మి' యనినాఁడు నన్నయ.

నన్నయభట్టారకుఁడు భారతరచన మారంభించినాఁడు. నిత్యము ప్రాతఃకాలముననే లేచి గోదావరిలో స్నానమొనర్చి సంధ్యావందనా ద్యనుష్ఠానములు దీర్చుకొని యింటికే తెంచును. పిమ్మట భారత రచనముఁ బ్రారంభించును. కుతప కాలమునకుఁ భారతరచనమును ముగించి యగ్నిహోత్రాదుల బూర్తిచేసి భుజించును. పిమ్మటనొకగంటసేపు విశ్రమించును. తరువాత రెండు గడియలపాటు తాను రచించిన పద్యములను పరిచూచుకొనును. ఇంతలో నారాయణభట్టచటికే తెంచును.

నన్నయభట్టు వ్యాసపీఠిపై నుంచి వ్యాసభారతములోని శ్లోకములు చదువుచుండును. నారాయణభట్టు నన్నయ విరచితములైన పద్యములను జూచుచుఁ దనకుఁ దోచిన సంస్కరణములను సూచించును. ఇరువురును విమర్శించుకొని సంస్కరింతురు. నారాయణభట్టు నన్నయకంటెఁ బాండిత్యమున

మిన్న. ఆతని బుద్ధి సునిశితమైనది. ఆతఁడుసూచించు చేర్పులు కూర్పులు నన్నయ కమితానందమును గూర్చును. ఇట్లు వారిరువురును సాయంసమయ పర్యంతము భారత సంశోధన మొనర్తురు. పిమ్మట నిరువురును గోదావరీ నదికేఁగి సాయం సంధ్యావిధులను నిర్వర్తించుకొని యిండ్లకేఁగుదురు. నన్నయ రాత్రిభోజనమైన పిమ్మట వ్యాసభారతముఁ జదువుచు మరు నాఁడు వ్రాయవలసిన ఘట్టములను వితర్కించుకొనును. రాత్రి పది గంటలవఱకును నట్లే వ్యాసకృత ఘట్టములను జదివి పిమ్మట నిద్రించును. ఇది యాతని దైనిక కార్య క్రమము. వైదికా నధ్యయనములందు భారతరచన మొన ర్చెడివాఁడు కాఁడు.

నన్నయభట్టారకుఁడు భారత రచనమును ప్రారంభిం చిన తరువాత రాజాస్థానమునకుఁ దఱచుగ పోవుట మాని నాఁడు. రాజరాజు సైతమాతని రచనా వ్యాసంగమున కంత రాయము కలిగింప నిచ్ఛగింపలేదు. నిత్యకృత్యమునకుఁ గావల సిన వస్తుసంభారములన్నియు రాజాజ్ఞననుసరించి నన్నయ భట్టారకుని యింటికిఁ జేరుచుండెను. కవి శిఖామణికి సంసార తాపత్రయ మేమాత్రములేదు.

అది మార్గశిరశుద్ధ చతుర్దశీ స్థిరవాసరము. ఆనాఁడ నధ్యయనము. నన్నయభట్టారకుఁడు ప్రాతఃకృత్యములఁ దీర్చుకొని కూర్చుండి యుండెను. ఇంతలో రాజభృత్యుఁ డొకఁడువచ్చి ప్రభువులుః తమ్ము స్మరించిరని చెప్పెను.

"అహా! ధన్యుఁడను. భారతాంధ్రీకరణమునకుఁ బూనుకొని నన్ను ధన్యునొనరింప మీరే సమర్థులు. నా యభ్యర్థనమును మన్నింపవలె."

"ప్రభువులు మఱచినారు. రాజగురువులు, రాజపురోహితులు, విశేషించి సోమయాజులునైన నన్నయభట్టారకులే పంచమవేదము నాంధ్రీకరింప నర్హులు. వారినికాదని యీ గౌరవము నాపై నిడుట యుచితము కాదు."

"అట్లయిన నన్నయ భట్టారకులనే ప్రార్థింతము. నా యభ్యర్థనమును త్రోసిపుచ్చరనునమ్మకము నాకున్నది."

"త్రోసిపుచ్చుటకిది రాజకార్యమే కాదు. దైవ కార్యము, ధర్మకార్యము!"

నాడు రాజరాజనరేంద్రులు సభాభవనమున గొలువు దీఱియుండిరి. నన్నయభట్టు, నారాయణభట్టు, చీదమార్యుడు, లేఖకుడు గండాచార్యుఁడు మున్నగువా రుచితాసనముల నాసీనులై యుండిరి. రాజరాజు నన్నయభట్టువైపు సాదరముగ వీక్షించి యిట్లనిరి—

"గురూత్తమా! చీదమార్యుల కిచ్చిన దానశాసనము పూర్తియైనదా?"

"చిత్తము! శాసనము లిఖించి గండాచార్యుని కొప్పగించినాను. వారు దానిని సిద్ధమొనర్చు చున్నారు."

"కులగురువుల నొక్కవిషయ మర్థించుచున్నాను."

"ప్రభువుల యనుగ్రహము!"

"మావంశరక్షకులైన భూసురులయెడ మాకున్న యభిమానము మీ రెఱుంగుదురు. వేదమత ప్రచారమునెడ మాకుగల నాశక్తియు మీ రెఱుంగనిదికాదు. భారత శ్రవణా శక్తియు, పార్వతీపతి పదాబ్జ ధ్యానపూజా మహోత్సాహ మును, మా కులపతు లెఱింగియే యున్నారు. మా చంద్ర వంశమునకు పురుచక్రవర్తి, పాండవేయులు వంశకర్తలని విని యున్నాను. విమలసద్గుణ శోభితులైన పాండవుల చరితమును వ్యాసరచితమైన దానిని మీరు వినిపింపగా విని యున్నాము. ఆభారత సంహిత నాంధ్రభాషలోని కవతరింప జేయవలె నని సంకల్పము గలిగినది. ఆ సంకల్పమును గార్యరూపమునం బెట్టి మమ్మనుగ్రహింపవలె."

ఈ మాటలకు నన్నయభట్టారకుఁ డులికి పడినాఁడు. ఇంచుక తేరుకొని—"ప్రభూ! ఇయ్యది కష్టసాధ్యమైనపని. నావలన నగునో కాదోయని సంశయము కలుగుచున్నది. ఉదాత్తచరిత్రమైన భారతగాధను—వ్యాసరచితమైన భారత మును దెనిగించుట సామాన్యముకాదు... ఈపనికి నాకంటె సంస్కృతాంధ్ర కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్ర భాషాకవి రాజశేఖరులు..."

నన్నయభట్టు మాట పూర్తికాకముందే రాజరాజు "నారాయణభట్టులు సమర్థులే! మీరు మాత్రము తక్కువ వారా? ఈ కార్యభారము మీరు వహింపకతప్పదు. మీపేరనే యాంధ్రమహాభారతము వెలయువలెను."

"చిత్తము! కవీభ వజ్రాంకుసుడును, అష్టాదశావ ధాన చక్రవర్తియును, నాకు సహాధ్యాయియునైన నారా

యణభట్టు సాయమున్నచోఁ దప్పక నిర్వహింపగలనను ధైర్యమున్నది."

రాజరాజు నారాయణభట్టువైపు జూచెను. నారాయణభట్టు — "నా సాయమునకై ప్రత్యేకముగ నడుగ నక్కరలేదుగదా? రాజాజ్ఞ నిర్వహణమున మీకుగల బాధ్యత నాకుమాత్రము లేదా?" యనెను.

వెంటనే రాజరాజు కర్పూర జాంబూనదాంబరాదుల దెప్పించి నన్నయకుఁ దాంబూలమిచ్చిరి.

'ధన్యోస్మి' యనినాడు నన్నయ.

నన్నయభట్టారకుఁడు భారతరచన మారంభించినాఁడు. నిత్యము ప్రాతఃకాలముననే లేచి గోదావరిలో స్నానమొనర్చి సంధ్యావందనా ద్యనుష్ఠానములు దీర్చుకొని యింటి కేతెంచును. పిమ్మట భారత రచనముఁ బ్రారంభించును. కుతప కాలమునకుఁ భారతరచనమును ముగించి యగ్నిహోత్రాదుల బూర్తిచేసి భుజించును. పిమ్మటనొకగంటసేపు విశ్రమించును. తరువాత రెండు గడియలపాటు తాను రచించిన పద్యములను పరిచూచుకొనును. ఇంతలో నారాయణభట్టచటి కేతెంచును.

నన్నయభట్టు వ్యాసపీఠిపై నుంచి వ్యాసభారతములోని శ్లోకములు చదువుచుండును. నారాయణభట్టు నన్నయ విరచితములైన పద్యములను జూచుచుఁ దనకుఁ దోచిన సంస్కరణములను సూచించును. ఇరువురును విమర్శించుకొని సంస్కరింతురు. నారాయణభట్టు నన్నయకంటెఁ బాండిత్యమున

మిన్న. ఆతని బుద్ధి సునిశితమైనది. ఆతఁడుసూచించు చేర్పులు కూర్పులు నన్నయ కమితానందమును గూర్చును. ఇట్లు వారిరువురును సాయంసమయ పర్యంతము భారత సంశోధన మొనర్తురు. పిమ్మట నిరువురును గోదావరీ నదికేఁగి సాయం సంధ్యావిధులను నిర్వర్తించుకొని యిండ్లకేఁగుదురు. నన్నయ రాత్రిభోజనమైన పిమ్మట వ్యాసభారతముఁ జదువుచు మరు నాఁడు వ్రాయవలసిన ఘట్టములను వితర్కించుకొనును. రాత్రి పది గంటలవఱకును నట్లే వ్యాసకృత ఘట్టములను జదివి పిమ్మట నిద్రించును. ఇది యాతని దైనిక కార్య క్రమము. నైదికా నధ్యయనములందు భారతరచన మొన ర్చెడివాఁడు కాఁడు.

నన్నయభట్టారకుఁడు భారత రచనమును ప్రారంభిం చిన తరువాత రాజాస్థానమునకుఁ దఱచుగ పోవుట మాని నాఁడు. రాజరాజు సైతమాతని రచనా వ్యాసంగమున కంత రాయము కలిగింప నిచ్ఛగింపలేదు. నిత్యకృత్యమునకుఁ గావల సిన వస్తుసంభారములన్నియు రాజాజ్ఞననుసరించి నన్నయ భట్టారకుని యింటికిఁ జేరుచుండెను. కవి శిఖామణికి సంసార తాపత్రయ మేమాత్రములేదు.

అది మార్గశిరశుద్ధ చతుర్దశీ స్థిరవాసరము. ఆనాఁడ నధ్యయనము. నన్నయభట్టారకుఁడు ప్రాతఃకృత్యములఁ దీర్చుకొని కూర్చుండి యుండెను. ఇంతలో రాజభృత్యుఁ డొకఁడువచ్చి ప్రభువులు తమ్ము స్మరించిరని చెప్పెను.

నన్నయ లోనికేఁగి శాలువ పైనగప్పుకొని రాజదర్శనము నకు బయలుదేరెను.

రాజరాజనరేంద్రుఁడు నన్నయభట్టారకునికై నిరీక్షించుచుండెను. ఇంతలో భట్టారకుఁ డేతెంచెను. రాజరాజాతని కభివాదనముసల్పి కూర్చుండజేసెను.

"భట్టారకుల భారతరచనా వ్యాసంగము నిరంతరాయముగ సాగుచున్నదా?"

"ప్రభువుల యనుగ్రహమున నేవిఘ్నమును లేదు."

"నారాయణభట్టారకులు కన్పించుచున్నారా?"

"నిత్యము వచ్చుచునే యున్నారు. నారాయణభట్టు లేని నన్నయ లేడు, ఆంధ్రభారతములేదు."

"అట్లనుచున్నారేల?"

ఆతఁడే నాకవిత్వమునకు మెఱుగులు దిద్దవలసినవాఁడు. అందుచేతనే యాతనినిగూర్చి యిట్లు చెప్పితిని. చిత్తగింపుడు-

పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్టు, తాను ను ధరామర వంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడుం దన కిష్టుఁడున్సహా
ధ్యాయుఁడునైనవాఁ డభిమతంబుగఁదోడయి నిర్వహింపగన్

"బాగున్నది! మీ యిరువురి చేతిమీదుగా నాంధ్ర భారతరచనము సాగుట యాంధ్రసరస్వతి యదృష్టము. మీ రిరువురు మా యాస్థానమున నుండుట మా యదృష్టము. మాటలసందర్భమునఁ జెప్పఁ మఱచితిని, రేపు చంద్రగ్రహణముగదా!"

నన్నయభట్టు కనులెందుకో చెమ్మగిలెను. ఆతఁడు కన్నులద్దుకొనుచు—"చిత్తము!"

"కులగురువు లేలకో దుఃఖితులైనట్లున్నారు?"

"ఏమియు లేదు. కులగురువునై పురోహితుఁడనై యున్న నేను ప్రభువులకు గుర్తు చేయవలసియుండగా ప్రభువులే నన్ను పిలిపించి చెప్పవలసి వచ్చినదేయని క్షణికోద్వేగము కలిగినది."

"అది మీ దోషముకాదు. మేమే మిమ్ము సోమయాజులనొనర్చి యీ బాధ్యతలనుండి తప్పించితిమి గదా! భారత రచనమే మాకు ప్రధానము. ఈ పనులెట్లైనను సాగిపోవును. రేపు చంద్రగ్రహణ నిమిత్తముగా నొక యగ్రహారమును దానమొనర్ప నెంచితిమి. తాము..."

"ప్రభువుల యుద్దేశ్యము తెలిసినది. ప్రభువులయనుగ్రహమున నా కేట్టిలోటును లేదు. నాచే యజ్ఞముచేయించితిరి. పంచమవేద రచనాభారము నాపైఁ బెట్టితిరి. ఇప్పుడీ యగ్రహారదానము..."

"మీ సంశయ మవగతమైనది. పురోడాశ పవిత్ర వక్త్రులు, పంచవవేద పరివర్తనాసక్తులునైన మీకు ప్రతిగ్రహదోషమును రానిచ్చుట భావ్యముకాదు. నిజమే! కాని..."

"ప్రభువులు సంశయింప నక్కరలేదు. వివిధభాషా కవిరాజశేఖరుఁడును, కవీభ వజ్రాంకుశుఁడును, అష్టాదశావధాన చక్రవర్తియు, నాకు హితుఁడును, విశేషించి ప్రభువు

లకుఁ గృపాపాత్రుఁడునైన నారాయణభట్టునాఁడు గదా! నారాయణభట్టు వేఱు, నన్నయభట్టు వేఱుగా ప్రభువులు తలంపనక్కరలేదు.''

'సరే! మీ రనినట్లే యగుగాక! గౌతమీ వైనతేయ నదులకు మధ్యస్థమైన నందమపూడిని సర్వకర పరిహారముగా నీయ సంకల్పించుకొంటిమి. శాసన రచనము మీ రొనర్ప వలసినదే!''

''చిత్తము!''

రాజానుమతిఁగొని నన్నయ వెడలిపోయెను. మఱు నాడు మార్గశీర్ష శుద్ధ పూర్ణిమా భానువారము. రాజరాజు పవిత్ర గోదావరీజలముల స్నానమాచరించి సోమోపరాగ సమయమున నందమపూడిని నారాయణభట్టారకునికి దానమొనర్చిరి. మఱునాడు నన్నయభట్టారకులు రచించిన శాసనము సభలో పఠింపఁబడెను.

యస్సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్ర భాషాసు
కవిరాజ శేఖర ఇతి ప్రథితస్సు కవిత్వ విభవేన
కవీన్మనీషాల వదుర్విదగ్ధాన్ మనోహరాభిర్నిజసూక్తిభిర్యః।
కుర్వన్న గర్వాన్పటు భిర్బిభర్తి కవీభ వజ్రాంకుశ
నామసార్థమ్॥

తస్మై సకల జగదభినుత గుణశాలినే సరస్వతీకర్ణావతంసా యాష్టాదశావధారణ చక్రవర్తినే నన్నినారాయణాయ భవ

ద్విషయే నందమపూడ్డి నామ గ్రామో గ్రహారీ కృత్య సోమ గ్రహణ నిమిత్తే ధారాపూర్వక మస్మాబిస్సర్వకర పరిహారేణ దత్తమితి విదితమస్తువః"

సభాసదులు హర్షధ్వానము లొనర్చిరి. రాజరాజు దానపత్రమును నారాయణభట్టున కొసంగి నమస్కరించెను. నారాయణభట్టు రాజును దీవించెను. పిమ్మట సార్వభౌములు శాసనమును శిలాక్షర మొనర్పవలసినదిగా గండాచార్యుని కాజ్ఞయిచ్చి నాటికి సభ చాలించెను.

భారతరచనము నిరంతరాయముగ సాగిపోవుచునే యుండెను. ఆదిపర్వము కొంతవఱకైనది. శకుంతలోపాఖ్యానము ప్రారంభము కావలసియుండెను. నన్నయ వ్యాసభారతము నందలి శకుంతలోపాఖ్యానమును వితర్కించుకొను కొండెను. ఇంతలో నారాయణ భట్టచటికి వచ్చెను. అంత వఱకును రచించిన గ్రంథమును సరిచూచుట పూర్తియైనది. నన్నయ శకుంతలోపాఖ్యానమును ప్రారంభింప నుండెను. నారాయణభట్టు నన్నయ నుద్దేశించి—'భట్టారకా! శకుంతలోపాఖ్యానమునకు ముందు యయాతి చరిత్రమును రచింపవలెను. యయాతి చరిత్రమునకుఁ బిమ్మట శకుంతలోపాఖ్యానమును జేర్పుము' అనెను.

"వ్యాసభారతమున శకుంతలోపాఖ్యానమే ముందున్నదిగదా! దానిని వ్యత్యస్తమొనర్చుట దోషముకాదా?"

అట్లయిన వ్యాసభారతమును పరివర్తన మొనరించుటయు దోషమేయగును."

నన్నయ లోనికేఁగి శాలువ పైనగప్పుకొని రాజదర్శనము నకు బయలుదేరెను.

రాజరాజనరేంద్రుఁడు నన్నయభట్టారకునికై నిరీక్షించుచుండెను. ఇంతలో భట్టారకుఁ డేతెంచెను. రాజరాజాతని కభివాదనముసల్పి కూర్చుండజేసెను.

"భట్టారకుల భారతరచనా వ్యాసంగము నిరంతరాయముగ సాగుచున్నదా?"

"ప్రభువుల యనుగ్రహమున నేవిఘ్నమును లేదు."

"నారాయణభట్టారకులు కన్పించుచున్నారా?"

"నిత్యము వచ్చుచునే యున్నారు. నారాయణభట్టు లేని నన్నయ లేడు, ఆంధ్రభారతములేదు."

"అట్లనుచున్నారేల?"

ఆతఁడే నాకవిత్వమునకు మెఱుగులు దిద్దవలసినవాఁడు. అందుచేతనే యాతనినిగూర్చి యిట్లు చెప్పితిని. చిత్తగింపుడు–

పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు, తాను ధరామర వంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడుం దన కిష్టుఁడున్సహా
ధ్యాయుఁడునైనవాఁ డభిమతంబుగఁదోడయి నిర్వహింపగన్

"బాగున్నది! మీ యిరువురి చేతిమీదుగా నాంధ్ర భారతరచనము సాగుట యాంధ్రసరస్వతి యదృష్టము. మీ రిరువురు మా యాస్థానమున నుండుట మా యదృష్టము. మాటలసందర్భమునఁ జెప్పఁ మఱచితిని. రేపు చంద్రగ్రహణముగదా!"

నన్నయభట్టు కనులెందుకో చెమ్మగిలెను. ఆతఁడు కన్నులద్దుకొనుచు—"చిత్తము!"

"కులగురువు లేలకో దుఃఖితులైనట్లున్నారు?"

"ఏమియు లేదు. కులగురువునై పురోహితుఁడనై యున్న నేను ప్రభువులకు గుర్తు చేయవలసియుండగా ప్రభువులే నన్ను పిలిపించి చెప్పవలసి వచ్చినదేయని క్షణికోద్వేగము కలిగినది."

"అది మీ దోషముకాదు. మేమే మిమ్ము సోమయాజులనొనర్చి యా బాధ్యతలనుండి తప్పించితిమి గదా! భారత రచనమే మాకు ప్రధానము. ఈ పనులెట్లైనను సాగి పోవును. రేపు చంద్రగ్రహణ నిమిత్తముగా నొక యగ్రహారమును దానమొనర్ప నెంచితిమి. తాము..."

"ప్రభువుల యుద్దేశ్యము తెలిసినది. ప్రభువులయను గ్రహమున నాకెట్టిలోటును లేదు. నాచే యజ్ఞముచేయించితిరి. పంచమవేద రచనాభారము నాపైఁ బెట్టితిరి. ఇప్పుడీ యగ్రహారదానము..."

"మీ సంశయ మవగతమైనది. పురోడాశ పవిత్ర వక్త్రులు, పంచమవేద పరివర్తనాసక్తులునైన మీకు ప్రతిగ్రహ దోషమును రానిచ్చుట భావ్యముకాదు. నిజమే! కాని..."

"ప్రభువులు సంశయింప నక్కఱలేదు. వివిధభాషా కవిరాజశేఖరుఁడును, కవీభ వజ్రాంకుశుఁడును, అష్టాదశావధాన చక్రవర్తియు, నాకు హితుఁడును, విశేషించి ప్రభువు

లకుఁ గృపాపాత్రుఁడునైన నారాయణభట్టున్నాఁడు గదా! నారాయణభట్టు వేఱు, నన్నయభట్టు వేఱుగా ప్రభువులు తలంపనక్కఱ లేదు.''

' సరే! మీ రనినట్లే యగుగాక! గౌతమీ వైనతేయ నదులకు మధ్యస్థమైన నందమపూడిని సర్వకర పరిహారముగా నీయ సంకల్పించుకొంటిమి. శాసన రచనము మీ రొనర్ప వలసిన దే!''

''చిత్తము!''

రాజానుమతిఁగొని నన్నయ వెడలిపోయెను. మఱు నాడు మార్గశీర్ష శుద్ధ పూర్ణిమా భానువారము. రాజరాజు పవిత్ర గోదావరీజలముల స్నానమాచరించి సోమోపరాగ సమయమున నందమపూడిని నారాయణభట్టారకునికి దాన మొనర్చిరి. మఱునాడు నన్నయభట్టారకులు రచించిన శాసనము సభలో పఠింపఁబడెను.

యస్సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్ర భాషాసు
కవిరాజ శేఖర ఇతి ప్రథితస్సు కవిత్వ విభవేన
కవీన్మనీషాల వదుర్విదగ్ధాన్ మనోహరాభిర్నిజసూక్తిభిర్యః।
కుర్వన్న గర్వాన్వపులు భిర్బిభర్తి కవీభ వజ్రాంకుశ
నామసార్థమ్॥

తస్మై సకల జగదభినుత గుణశాలినే సరస్వతీకర్ణావతంసా యాష్టాదశావధారణ చక్రవర్తినే నన్నినారాయణాయ భన

ద్విషయే నందమపూణ్డి నామ గ్రామో గ్రహారీ కృత్య సోమ గ్రహణ నిమిత్తే ధారాపూర్వక మస్మాభిస్సర్వకర పరిహారేణ దత్తమితి విదితమస్తువః"

సభాసదులు హర్షధ్వానము లొనర్చిరి. రాజరాజు దానపత్రమును నారాయణభట్టున కొసంగి నమస్కరించెను. నారాయణభట్టు రాజును దీవించెను. పిమ్మట సార్వభౌములు శాసనమును శిలాక్షర మొనర్పవలసినదిగా గండాచార్యుని కాజ్ఞయిచ్చి నాటికి సభ చాలించెను.

భారతరచనము నిరంతరాయముగ సాగిపోవుచునే యుండెను. ఆదిపర్వము కొంతవఱకైనది. శకుంతలోపాఖ్యానము ప్రారంభము కావలసియుండెను. నన్నయ వ్యాసభారతము నందలి శకుంతలోపాఖ్యానమును వితర్కించుకొను చుండెను. ఇంతలో నారాయణ భట్టచటికి వచ్చెను. అంత వఱకును రచించిన గ్రంథమును సరిచూచుట పూర్తియైనది. నన్నయ శకుంతలోపాఖ్యానమును ప్రారంభింప నుండెను. నారాయణభట్టు నన్నయ నుద్దేశించి—'భట్టారకా! శకుంతలోపాఖ్యానమునకు ముందు యయాతి చరిత్రమును రచింపవలెను. యయాతి చరిత్రమునకుఁ బిమ్మట శకుంతలోపాఖ్యానమును జేర్పుము' అనెను.

"వ్యాసభారతమున శకుంతలోపాఖ్యానమే ముందున్నదిగదా! దానిని వ్యత్యస్తమొనర్చుట దోషముకాదా?"

అట్లయిన వ్యాసభారతమును పరివర్తన మొనరించుటయు దోషమేయగును."

“అట్లు వ్యత్యస్త మొనర్చుటకుఁ గారణముండవలెను గదా?”

“కారణము లేకేమి? యయాతి దుష్యంతుని కంటెను చాల పూర్వుఁడు. యయాతి చరిత్రమును జెప్పినపిమ్మట నే దుష్యంతుని చరిత్రము జెప్పుట యుక్తిసంగతము. అట్లు చెప్పుటలోనే యౌచిత్యమున్నది.”

“వ్యాసభగవానుని కామాత్రము తోచలేదా?”

“వ్యాసభగవానుని విషయ మట్లుంచుము. ఆయన పొరపాటు పడియుండవచ్చును. వ్యాసభగవానుడు సరిగనే రచియించి యుండగా తరువాతివారు దానిని వ్యత్యస్త మొన రించిరేమో! ఎట్లయిననేమి? తెలిసినంతలో సముచితమైన మార్పులు చేయవలె.”

“ఏమో! మీ యుక్తులన్నియు విచిత్రముగ నుండును. సంస్కృతభారతమున కనువాదము పనికిరాదంటిరి. స్వతంత్ర రచనమువలె నుండవలె నంటిరి. పంచమవేదము నిట్లిచ్చ వచ్చినట్లు మార్చుటకు నాకేలకో భయమగుచున్నది.”

“ఇందు భయకారణ మేమున్నది? వ్యాసకవికున్న స్వేచ్ఛ నీకును నున్నది. ఆంధ్రభారతమున నీవ్యక్తిత్వము, ఆంధ్రుల వ్యక్తిత్వము, ఆంధ్రభాషాదేశ సంప్రదాయములు ప్రతిబింబింపవలెను. ఈ కారణముచేతనే మూలముననున్న కొన్ని కథలను సంగ్రహపఱచి కొన్నింటిని విపులముగ వ్రాయ వలెనంటిని. కొన్ని కథలను వదలివేసినను బాధలేదు. ఇతిహాస

వైన మహాభారతమున నట్టిస్వేచ్ఛను వహించుటలోఁ దప్పు లేదు. సంస్కృతభారతమును దగ్గఱ పెట్టుకొని మనభారత మును చదువుకొనువారుండరు. సంస్కృత భారతము జదువఁ దగినవారు కథకొఱకై యీ భారతమును చదువనక్కఱలేదు గదా! అందుచేతనే స్వతంత్రరచనయో యనునట్లుండవలె నంటిని.''

''సరే! అట్లేయగుగాక! నారాయణభట్టుల యూహ లన్నియు నిట్లేయుండును.''

ఈరీతిగ ప్రతివిషయమును వారిరువురును తర్కించు కొని యొక నిర్ణయమునకు వచ్చి భారతరచనము సాగించు చుండిరి. అప్పుడప్పుడు రాజరాజనరేంద్రుఁడు సభలో నన్నయభట్టారకునిచే నాంధ్రభారత కథాశ్రవణ మొనరింపఁ జేయుచుండిరి.

భారతిముఖ నాదిసభాపర్వములు పూర్తియైనవి. వార్ధక్యమున నన్నయ శరీరపటుత్వముతోఁబాటు మానసిక పటుత్వమును తగ్గినది. నన్నయకంటె పెద్దవాడు నారాయణ భట్టు. ఆతనిని వైతము వార్ధక్య మావేశించినది. అయినను నెట్లో భారతరచనమును మాత్రము సాగించుచునే యుండిరి.

ఇంతలో రాజరాజు వ్యాధిగ్రస్తుఁడయ్యెను. మృత్యు ముఖమున నుండియు నాతఁడు ఆంధ్రభారతమును గూర్చియే పలవరించెను. మరణశయ్యకుఁ బ్రక్కన కనిపెట్టుకొనియున్న నన్నయ నారాయణభట్టులను గాంచి యస్పష్టభాషణముల నే

మేమో చెప్పును. తనజీవితకాలమున భారతశ్రమము పూర్తి కాలేదని తలంచుకొని కంట నీరుడును. మేము దానిని పూర్తి చేసి లోకమున వెలయింపఁ జేతుమని వారిరువురు నాశ్వా సింతురు. చివఱికది తీరని వ్యాధియై వేంగీసామ్రాజ్య రమా రమణునిఁ బొట్టఁబెట్టుకొనెను. ఓహో! మృత్యువెంత నిర్దయ మైనది? దానికి యుక్తాయుక్త విచక్షణములేదు. సమయా సమయ పరిజ్ఞానము లేదు. దాని గమనమున కడ్డులేదు. రాజాధిరాజు లగుగాక! అది యెవరికొఱకును క్షణమాగదు. దాని దృష్టి పడకపూర్వమే యిచటి కార్యములు చక్క బఱచుకొనవలె!

రాజరాజు మరణము నన్నయకుఁ గుణాఘాతరూప మైనది. ఏమహారాజు కులగురువని తన్ను సంభావించెనో, ఏ రాజరాజు తన కెట్టి లోటును గలుగ నీయక పోషించెనో, ఏ మహారాజు భారతాంధ్రీకరణమునకుఁ దన్ను ప్రేరేపించి తనచే యజ్ఞయాగాదులు చేయించెనో, ఏ మహారాజు బ్రాహ్మణ భోజనానంతరముగాని తాను భుజించెడివాఁడు కాఁడో, ఏ యవనీపతి వేద మతోద్ధరణమే లక్ష్యముగాగొని నేల యేలెనో యట్టి రాజరాజు మరణించుట నన్నయకు దుఃఖహేతువుగాక మఱేమి?

రాజరాజునకుఁ బిమ్మట నాతని కుమారుఁడు రాజేం ద్రుఁడు రాజాయెను. రాజ్యమునకు వచ్చినంతనే యాతఁడు చోళదేశమును జయించుటకు సన్నాహము లొనర్చి దానిని వశపఱచుకొనెను. అతఁడు మేనమామ కుమార్తెయైన మధు

రాంతకదేవిని పరిణయమాడి చోళదేశమున కేఁగెను. రాజమహేంద్రవరమునను న్న సంవత్సరకాలములో నాతనికి విజిగీషామనీషతప్ప భారతవిషయమే పట్టలేదు. చిన్ననాటి నుండియు చోళదేశమున నుండిన వాడగుటవలన నాతనికిచటి విషయములే తెలియలేదు—పట్టించుకొనలేదు.

నన్నయ వృద్ధుఁడై మానసిక శారీరక పటుత్వములు తగ్గియు భారతరచన మెట్లో మెల్లగ సాగించుచుండెను. నారాయణభట్టు పూర్తిగ మంచమునఁబడి నన్నయవద్దకు వచ్చుటయేలేదు. అప్పుడప్పుడు నన్నయయే యాతని యింటికేఁగి మంచమువద్దఁ గూర్చుండి కొంతసేపు తమ పూర్వజీవిత గాథలను త్రవ్వుకొని, రాజరాజును స్మరించి కన్నీరు నింపుకొనెడివారు. నన్నయ క్షీణస్వరముతో, క్షీణదృష్టితోఁ బద్యములు చదువును. నారాయణభట్టు వినును. కాని వెనుకటి పాటవము లేకపోవుటచే సంస్కరింపడు. విని యూరకుండును.

ఒకనాఁ డుదయము నన్నయ లేని యోపికఁ దెచ్చుకొని భారతరచనమునఁ గూర్చుండెను. అరణ్యపర్వములోని నాల్గవ యాశ్వాసము సాగుచుండెను.

"శారదరాత్రు లుజ్జ్వలలసత్తర తారకహార పంక్తులన్
జారుతరంబులయ్యె వికసన్నవ కైరవ గంధబంధురో
దార సమీర సౌరభముదాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూర పరాగపాండు రుచిపూరములంబరపూరితంబులై"

ఇంతలో నెవరో పరువెత్తుకొనివచ్చి నారాయణ భట్టారకులు పరమపదించిరని చెప్పిరి. నన్నయ శిలాప్రతిమయై పోయినాడు. కొంతవడికిఁ దెప్పరిలి నారాయణభట్టు నింటికేఁగినాడు. ఏమున్నది ? ఆ కవిభవ్రజాంకుశుఁడు, ఆ యష్టాదశావధాన చతురుఁడు, ఆకవిరాజ శేఖరుఁడు, వివిధ భాషా కవితా విశారదుఁడు, ఆ సరస్వతీమూర్తి శాశ్వతముగ కన్నుమూసి యున్నాడు. నన్నయ తండ్రిని గోల్పోయిన వానివలె దుఃఖించినాడు. తానొక బుజమిచ్చి యా మహామనీషిని శ్మశానమునకుఁ గొంపోయి దాహకర్మలొనర్చినాఁడు. ఇంటికి వచ్చునప్పటికి సాయంకాలము నాల్గుగంటలైనది. విచారము కలిగి వాంతియైనది, అంతే, మంచమెక్కినాడు నన్నయభట్టారకుఁడు. ప్రభువైన రాజరాజు మరణము, మిత్రుడు, సహాధ్యాయి, గురుతుల్యుఁడునైన నారాయణ భట్టు మరణము నన్నయభట్టును కలఁచివేసినవి. ఎంత ప్రయత్నించినను దుఃఖమాగదు. ఎంత ప్రయత్నించినను వారిరువురును స్మృతిపథమునుండి తొలఁగరు. "ఓ యాదికవీ! వాగనుశాసనా! రమ్మా! అందఱ మొకేచోట నుందుదము. ఇచట చాల ప్రశాంతముగ నున్నది. మన కవితావ్యాసంగ మిచటనే సాగునుగాక!" యని యాహ్వానించుచున్నట్లుండి— 'ఇదిగో వచ్చుచున్నాను. నేనుమాత్ర మిచట నుందునా! ఇదిగో వచ్చుచున్నాను.' అని కలవరించును. చూచినవారందఱును నన్నయకు మతిభ్రమ కలిగిన దనుకొనుచున్నారు. నిజమే! లోకులు మఱేమనుకొనగలరు! ఆ హృదయమును...

దగిలిన గాయము, దానివలనగలుగు బాధ లోకుల కేమి తెలియును? పిచ్చియెత్తినది తమకో లేక నన్నయకో తెలిసి కొనజాలని పిచ్చివారు!

నన్నయ పదిదినము లట్లేయున్నాడు. మధ్యమధ్య భారతమునందలి పద్యములు చదువును. నారాయణభట్టుతో తర్కించును. రాజరాజున కందలి యౌచిత్యానౌచిత్యము లను విశదపఱచును. ప్రభువు మెచ్చుటను, సహాధ్యాయి మెచ్చుటను దలఁచి నవ్వును. ఇంతలో వారి స్మృతి కలిగి యేడ్చును. ఈ నవ్వ లేడ్పులను గాంచినవారు నన్నయకు బిచ్చియెత్తినదనిరి.

నిజమే! నన్నయకుఁ బిచ్చియే పట్టినది. ఆ పిచ్చియే కవిత్వము. లోకులకుఁ బట్టిన పిచ్చివేఱు! కవులకుఁబట్టిన పిచ్చి వేఱు! కవులకాపిచ్చియే పట్టనిచో విశ్వమున నింత వాఙ్మ యమే యుండెడిదికాదు. కవులాపిచ్చినే కోరుదురు. ఆపిచ్చి నెఱింగినవారు దానినే యారాధింతురు. ఆ పిచ్చిలో, ఆనన్న యకుఁబట్టినపిచ్చిలో శతాంశమైనను మనకుఁ బట్టినచో ధన్యుల మగుదుముగదా యని యువ్విళ్ళూరుచుందురు.

ఏమైననేమి మూడవనాఁ డుదయమున సూర్యోదయ సమయమున కవిభాను డస్తమించినాఁడు. ఆదికవి, వాగను శాసనుఁడు, ఇహలోకయాత్ర చాలించినాఁడు. ఆంధ్రకవితా సరస్వతి కన్నీరు మున్నీరుగా విలపించినది. ఆంధ్రమహాభారత

మరణ్యామధ్యమున నిలిచిపోయినది. ఆంధ్రులరోదన మరణ్యా రోదనమే యైనది.

నన్నయభట్టారకునికి వాగనుశాసనుడనియు, నాదికవి యనియు బిరుదుల నుంచుట యాంధ్రులలో నాచారమై యున్నది. ఈతఁడు ఆంధ్రశబ్ద చింతామణియను వ్యాకరణ మును రచించె నందురు. నేడుపలబ్ధమై వ్యాప్తిలోనున్న ఆంధ్రశబ్ద చింతామణియందు సూత్రములు సంస్కృతములో నుండి యుదాహరణలు తెనుఁగులో నున్నవి. తానాంధ్ర శబ్ద చింతామణిని రచించినట్లుగాని, తనకు వాగనుశాసనాది బిరుదములున్నట్లుగాని యాతఁడెచ్చటను ప్రస్తావించి యుండ లేదు. అప్పకవి చెప్పునంతవఱకు నీ గ్రంథమును గూర్చి యెవ్వరికిని దెలియదు. అప్పకవి తాను రచించిన అప్పకవీయ ములో నీ గాథను చొప్పించినాఁడు. అప్పకవికి శ్రీకృష్ణుడు స్వప్నములో సాక్షాత్కరించి—

ఉ. ఈయువతుల్ క్షమాధరణులేను బయోరుహపత్రనేత్రుఁడన్
నీయెడఁగూర్మిగల్గి ధరణీ దివిజోత్తమ! వచ్చినాఁడ స్వ
శ్రేయసమబ్బ నీకునిఁక సిద్ధము నన్నయభక్తి యాంధ్రముం
జేయుము, మాయనుగ్రహముచేఁ గవు లచ్చెరువంది
మెచ్చఁగన్.

క. వినియును కనియును నెఱుఁగని
ఘనభక్తిం దెనుఁగుఁ జేయుఁగా నట్లగు వా

కనవలదు దాని లక్షణ
మును నీకది గలుగు చందమును వినుమింకన్

గీ. ఆంధ్రశబ్ద చింతామణి వ్యాకరణము
ముందు రచియించి తత్సూత్రములఁ దెనుంగు
బాసచేఁ జెప్పె నన్నయభట్టు తొల్లి
పర్వములు మూడు శ్రీ మహాభారతమున.

వ. తదనంతరంబ... ... ... ... ... ... ...

రాజరాజనరేంద్ర తమూజుఁ డార్య
సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయ రచించునెడఁ బఠనం బొనర్చి
నన్యులెవ్వరెఱుఁగ రీ యాంధ్రఫక్కి.

ఆలోకనుతుఁడు మొన్నటి
కీలకసమ నామతంగ గిరికడ నొసఁగెన్
బాలసరస్వతులకు నతఁ
డోలిఁ దెనుఁటీక దాని కొప్పుగ జేసెన్.

అప్పకవి యీ విధమున నన్నయ రచితమైన ఆంధ్ర శబ్ద చింతామణి బాలసరస్వతికి లభించిన విధమును తెలిపి నాఁడు. నన్నయభట్టు రచించినాడన్న నన్నయభట్టీయము (వ్యాకరణము) అప్పకవి కాలమునకే ప్రచారములో లేదనుట స్పష్టము. అట్టి గ్రంథము తనకు లభించుటను సమర్థించు

కొనుటకే యప్పకవి యీ కథ నల్లెనేగాని యిందేమాత్ర మును సత్యములేదు. అప్పకవి గాంచిన కల కల్ల. ఆ స్వప్న వృత్తాంతమంతయు స్వకపోల కల్పితము. రాజరాజనరేంద్రునకు సారంగధరుఁడను కుమారుఁడున్నాఁ డనుటకు నిదర్శనములు లేవు. నన్నయ సారంగధరుని కీయాంధ్ర ఫక్కి నేర్పుటయు, సిద్ధులలో కలసిన సారంగధరు డైదారువందల సంవత్సరముల పిమ్మట బాలసరస్వతులకీ యాంధ్ర శబ్దచింతామణి యొసంగుటయు విశ్వాసనీయములు కావు.

నన్నయ విరచితమైన భారతము లోకవ్యాప్తి నంది యుండగా నాంధ్రశబ్ద చింతామణి మాత్రమే నశించుటకుఁ గారణమేమని ప్రశ్నింతురు. కావుననే భీమకవి వృత్తాంతము నీ విధముగఁ జొప్పించినాఁడు.

భారతము రచించుచుఁ దారచించి
నట్టి రాఘవ పాండవీయము నడంచె
ఛందము నడంపె నీఫక్కి సంగ్రహించె
ననుచు భీమన యెంతయు నడచెదాని.

ఆదిని భీమకవీంద్రుఁడు
గోదావరిఁ గలిపె దానిఁ గుత్సితమున నా
మోదను రాజనరేంద్ర
త్మోదయితుని పట్టి దాని మహిని వెలయించెన్

భీమకవీంద్రుఁడు రాఘవపాండవీయ మనుద్వ్యర్థి కావ్యమును రచింపఁ బూనినట్లును, తాను రచించుచున్న భారత మీరాఘవ పాండవీయమువలన లోకవ్యాప్తి నందదను భయముతో నన్నయభట్టు దానిని (రాఘవపాండవీయమును) నాశన మొనర్చినట్లును, ఆ కారణమున భీమకవి నన్నయ రచించుచున్న ఆంధ్రశబ్ద చింతామణియను వ్యాకరణము వలనఁ దాను రచించుచున్న ఛందోగ్రంథము నాశనమై పోవునను భయముతో నన్నయ వ్యాకరణమును గోదావరిలో కలిపినట్లును, రాజరాజతనూభవుఁడైన సారంగధరుఁడు బాల్యమున నన్నయవద్ద నా యాంధ్రఘక్కిని చదివి యుండుటచే మఱల దానిని వెలయించె ననియు నప్పకవి చెప్పెను.

భీమన రాఘవపాండవీయమను ద్వ్యర్థి కావ్యము రచించినట్లు పింగళి సూరన సాక్ష్య మిచ్చియున్నాడు. కావ్యము మాత్రము కానేరాదు. నన్నయది భారతము, భీమనది ద్వ్యర్థి కావ్యము. ఆ ద్వ్యర్థి కావ్యమువలన దన భారతమును లోకమున వ్యాపింపదని నన్నయ భయపడి దానిని నాశన మొనరింప జేసెననుట పొసఁగదు. అట్లే భీమన రచించినది ఛందస్సు. నన్నయ్య రచించినది వ్యాకరణము. నన్నయ వ్యాకరణమువలన దనఛందస్సు మూలబడునని భీమన దానిని గోదావరిలోఁ గలిపించుటయు నమ్మదగిన విషయము కా [illegible]

ఆకవు లిరువురికి నిట్టి కళంకము చేతులార దెచ్చిపెట్టినవాఁడు అప్పకవి. నన్నయపేరు పెట్టిననేగాని దానికి వ్యాప్తి కలుగ దని తలంచి యప్పకవియే తన యప్పకవీయమున నిట్టి విరుద్ధములైన విషయములతో నొకగాథనల్లి లోకమున వ్యాపింపఁ జేసెను. నన్నయభట్టారకుఁడు వ్యాకరణమును రచింప లేద నుట వలన నాతని ఖ్యాతికి లోటురాదు. కాని భీమన వృత్తాంత మనవసరముగ తెచ్చిపెట్టుట వలన నాతని కప్పకవి యపఖ్యాతిని మాత్రముఁ దెచ్చినాఁడు. ఈగాథ నాధారముగ జేసికొనియే పలువురు పలువిధములైన గాథలల్లిరి. భీమకవి గ్రంథమును నాశన మొనర్చుట చేతనే నన్నయ కకాల మృత్యు వాసన్నమైన దనిరి. ఆకారణముననే యాతనికి మతి భ్రమ కలిగిన దనిరి. ఆకారణముననే భారతరచన మాగిపో యినదనిరి. ఇవి యన్నియు నాధారములేని గాథలు. నేల విడిచిన సాములు.

పైగా వ్యాకరణరచనమున నారాయణభట్టు సాయ మొనర్చెనని వ్రాసినాఁడు. భారతమున నారాయణభట్టు తనకు సాయ మొనర్చినట్లు నన్నయ వ్రాసియున్నాఁడు. కావున నీయాంధ్ర శబ్దచింతామణిని రచించుటయందు నైత మాతఁడు సాయ మొనర్చినాఁడని యప్పకవి కల్పించినాఁడు. ఐదువందల సంవత్సరములు లోకములో వ్యాప్తిలో లేని

వ్యాకరణమును తనకొక బ్రాహ్మణుఁడు తెచ్చి యిచ్చెనని చెప్పినాఁడప్పకవి. అపూర్వగ్రంథ సంపాదకుఁడని కీర్తి సంపాదింపవలెననియో లేక తానురచించు గ్రంథమును కవిపండితులాదరింపరేమో యను భయముననో, అప్పకవి యీకథ నల్లెను.

ఈ యప్పకవి వ్రాతలవలన నన్నయభట్టారకుని కీర్తి యినుమడింపక పోగా నాతనికిఁ గళంకములు వాటిల్లినవి— భీమన రచించిన రాఘవపాండవీయమును నాశన మొనర్చెననియు; ఆకారణమున నన్నయభట్టారకునకు మతిభ్రమ కలిగి భారతరచన మాఁగిపోయినదనియు; యదార్థమును బయలుచేసి నన్నయ కాపాదింపఁబడిన కళంకములను తుడిచివేయుటకే యీ విషయము చెప్పవలసి వచ్చినది.

నన్నయభట్టారకున కాదికవియను బిరుదు వ్యాప్తిలో నున్నది. తెనుఁగుభాషలో మొదట గవిత్వము చెప్పినవాఁ డీతఁడే యనియు, నందుచే సంస్కృతమున వాల్మీకివలె దెనుఁగునకు నన్నయయే యాదికవియనియు నందురు. కాని యట్లనుట సమంజసముగాఁ దోఁపదు. ఆతనికిఁ బూర్వము నుండియు శాసనాదులందుఁ దెనుగు పద్యములను వాడుట యాచారమై యున్నది. ప్రౌఢకావ్యములు లేకపోవచ్చును గాక! కవిత్వరచనము మాత్రము నన్నయకుఁ బూర్వము నుండియు గాన్పించుచున్నవి. అంతియగాక భీమకవి, నన్న

చోడులాదిగా కొందరు కవులు నన్నయకుఁ బూర్వమే ప్రౌఢ కావ్యనిర్మాణ మొనర్చిరనియు, నన్నయ సమకాలీనులైన అధర్వణాచార్యుఁడాదిగా కవులుసైత ముండిరనియుఁ గొందఱి మతము.

నన్నయభట్టారకుఁ డాదికవి కావచ్చును, కాకపోవచ్చును. నన్నయకుగల గౌరవ మాతని భారత రచనము వలన సంక్రమించినదేగాని యాదికవి యగుటవలన లభించినది కాదు. అధిక పక్షపాతముతో నాతఁడే యాదికవి యనిగాని, ద్వేషముతో నాతఁడు కాఁడనిగాని చెప్పి సమర్థింప జూచుట వలన నాతని చరిత్రకు అధిక గౌరవముగాని, న్యూనతగాని యేర్పడదు. నన్నయ విరచితము మనకు లభించి యున్నది భారతము. దానినిఁబట్టియే నన్నయ వ్యక్తిత్వమును చిత్రించుకొనుట సంగతము.

ఇది యిట్లుండఁగా నన్నయ చరిత్రమునకు వేఱొక నింద నాపాదించిరి. నన్నయభట్టారకుఁ డాదిపర్వము ముగించి, సభాపర్వము వ్రాయుచుండఁగా నధర్వణాచార్యుఁడను కవి పండితుఁ డొకఁడు తాను మహాభారతమును రచియించి రాజరాజనరేంద్రున కంకిత మీయఁ గొనివచ్చెనట. ముందుగా నాతఁడు రాజాస్థాన పండితుఁడైన నన్నయభట్టారకుని జూడ నేతెంచి తాను రచించిన భారత భాగములను జదివి వినిపించెనట. నన్నయ యాతని కవితాసంగ్రహ నైపుణి కచ్చెరువఁది యిట్లు శంకించెనట—"ఈతని భారతమును రాజరాజ

నరేంద్రుఁడు చూచినచో మిగుల సంతసించును. దానినే గ్రహించును. ఇంతటితో నేను వ్రాయుచున్న భారతము పరిసమాప్తిఁజేందును. ఎట్లైనను నీతని భారతము రాజరాజ నరేంద్రుని కంటబడకుండ చేయవలెను. ఈతని నిచ్చట లేకుండఁ జేసినచో నీవిపత్తు తొలఁగును. పిమ్మట నేను గ్రంథమును బూర్తిచేసి రాజున కొసఁగవచ్చును.'' ఇట్లు చింతించి రేపు సభకేగుదమని చెప్పి యాతనిని బంపివేసెనట.

పిమ్మట నాతఁడు విడిసియున్న గృహాయజమానిని బిలిపించి యాతనికిఁ గొంత ద్రవ్యమిచ్చి యాకవి యింటలేని సమయమున నింటికి నిప్పుపెట్టుమని చెప్పెనట. మరునాఁడు నన్నయభట్టు అథర్వణుని రాజాస్థానమునకు రమ్మని తోడ్కొనిపోగా నాయింటివారు యిల్లు తగులబెట్టిరట. ఆవృత్తాంతము అథర్వణాచార్యుఁడు విని విలపించుచు నాయింటివద్దకేతెంచి దుఃఖాతిరేకమున 'తనజీవిత సర్వస్వమైన మహాభారతము దగ్ధమైనతఱి నేనింక బ్రతికి ప్రయోజనమేమి?' యని తలఁచి క్రోధమున 'నాకిట్టి యపకృతిగావించిన వాఁడు నావలెనే సమస్తమైన ఐహికములకు దూరుఁడగు గాక!' యని శపించి యాయగ్ని జ్వాలలలోబడి ప్రాణత్యాగ మొనర్చెనట. ఈశాపఫలముగ నన్నయకుఁ బిచ్చియెత్తిన దనియు భారత రచనము పూర్తికాకమునుపే చనిపోయెననియునొకగాథప్రచారమందున్నది.

ఈ పైగాథ నిరాధారమైనదనియు, నసత్యకల్పనమనియుఁ జెప్పుట కెట్టియభ్యంతరమును లేదు. అథర్వణా

చార్యుఁడు భారతమును సంపూర్ణముగ రచించినాఁడనుటకుఁ దగిన నిదర్శనములు లేవు. కవులు మాత్సర్యగ్రస్తులై యుండుట సహజమేమైనను, రాజరాజనరేంద్రునికిఁ గులగురువై, యభిమానపాత్రుఁడైన నన్నయభట్టారకునివంటి వాఁడు అథర్వణుని వలనదనకు రాజసమ్మానము లోపించునని భయపడి యిట్టిదౌష్ట్య మొనరించినాఁడనుట సాహసమనిపించుకొనును. విమర్శకులు సమకాలీనులయెడ కాఠిన్యము వహించినను సహింపవచ్చునుగాని పూర్వులయెడ నింతటి నిర్దాక్షిణ్యభావముతో నాధారరహితములైన పుక్కిటి పురాణములను నమ్మి వారి చరిత్రలను గలుషిత మొనర్చుట సహింపరాని విషయము. అరణ్యమధ్యమున నన్నయభట్టారకుని మృతికిఁ గారణములు వీరిన్ని విధములఁ గల్పింపనేల? మృత్యువు మన పనులు పూర్తియైనపిమ్మట, మనముపిలిచినప్పుడు వచ్చునా? అట్లే వార్ధక్యమున మతి చాంచల్యమునకుఁ గారణములు కావలెనా? నన్నయార్యుని భారతముకంటె,ఆతని కవితాశక్తికంటె జనసామాన్యమున నీగాథలకే ప్రాధాన్యమబ్బి యాతని చరిత్ర కళంకితమగుటభాషకుగాని, మనకుగాని మేలుకాదు. నన్నయకు కాదు—నిరాధారములైన గాథలల్లి పంచమవేద పరివర్తనం బొనరించిన మహాకవి చరిత్రమునిట్లు కలుష మొనరించినందులకు పశ్చాత్తాపముతో మనకే పిచ్చియెత్తవలెను. ఆధునికుల కంతటి భాగ్యముగూడనా?

నన్నయ రాజరాజునకుఁ గులబ్రాహ్మణుఁడు. జపహోమసంపన్నుఁడు. శివోపాసకుఁడు. వేదాభ్యాసి. బ్రాహ్మణాగ్రణి

మహాపురాణవిదుడు. ఉభయభాషాకావ్య నిర్మాణచణుడు. విద్యాదయితుఁడు. లోకజ్ఞుఁడు. ప్రతిభాభియోగ్యుఁడు. నిత్య సత్యవచనుడు. పరమధర్మవిదుడు. సద్వినుతావదాత చరితుడు. వీని నాధారముగ నన్నయచరిత్రను నిర్మించుకొన్నుడు.

అది తెనాల్యగ్రహారము. బ్రాహ్మణవీధి. ఆ వీధిలో నొకయింటి ముంగిట చాలమంది జనులు గుమిగూడి యుండిరి. వారిలో నొకవ్యక్తి యాయింటి యజమానితో కలహించుచుండెను — "మీ మేనల్లుడు మా పిల్లలను బ్రతుకనిచ్చుటలేదు. అతని యాగడములు మితిమీఱి పోవుచున్నవి. మీకు ముద్దుగా నుండవచ్చునుగాక! మేమెట్లు సహింపగలము? ఇదిగో చూడుడు! వీని నెత్తిపై గబగబ నాలుగు మొట్టి పాఱిపోయినాడు. మీ ముఖము చూచి యిన్నాళ్ళు సహించితిమి. మీరు గట్టిగా మందలించి బుద్ధి చెప్పనిచో మేమే చెప్పవలసి యుండును."

ఇంకొక వ్యక్తి యందుకొనినాడు. — "మొన్న మా పిల్లవాని వీఁపు చితుకబాది పాఱిపోయినాడు. మా పిల్లలతో నాడు టెందులకు? వారిని చావబాదు టెందులకు?"

ఇట్లే పలువురు పలువిధములుగ నాబాలుఁడొనర్చిన యల్లరిని గూర్చి వర్ణించుచు నాతని నదుపులో పెట్టుడని యాగృహస్థునితో జెప్పుచుండిరి. పాపమాగృహస్థు భీత దృక్కులతో మాట్లాడజాలక నిలవఁబడి యుండెను. ఒక వితంతువు తలుపుచాటున నుండి యిదియంతయుఁ గమనించుచుఁ గంట నీరు పెట్టుచుండెను. కొంతసేపటికా గృహస్థు తేరుకొని ప్రాధేయపూర్వకముగ వారితో నిట్లనెను — 'అయ్యలారా! మావాఁడొనర్చుచున్న యాగడములు నేనెఱుఁగుదును. అనేక పర్యాయములు దండించితిని. తండ్రిలేని బిడ్డడు

గదా యని కఠినముగ శిక్షింపజాలకున్నాను. ఇఁకనుండి మా వాని విషయమున జాగ్రత్త వహింతును. నేటికి క్షమింపుఁడు.'

చివఱకెట్లో వారందరును శాంతించి వెడలిపోయిరి. ఇంటియజమాని లోనికేఁగి యావితంతువుతో-"అమ్మాయీ! మన రాముని యల్లరి మితిమీఱి పోవుచున్నది. ఎన్ని పర్యాయములు బుద్ధిచెప్పినను మానఁడు. చెప్పినంతసేపును తల వంచుకొని బుద్ధిమంతునివలె నుండును. పిమ్మట యథాప్రకారమే! ఏమిచేయుటకును తోఁచకున్నది."

"అన్నయ్యా! ఉపనయన మొనర్చితివిగదా! ఎచటికైనను గురుకులమునకు బంపినచో బాగుండునేమో!"

"అమ్మాయీ! తండ్రిలేని బిడ్డడు. నీవైనను దగ్గఱ నుండి చూచుచుండనిచో వాడుండగలఁడా? పండ్రెండేండ్లయినను నిండని పసివాఁడుగదా! దూరదేశమేఁగి యుండగలఁడా?"

"కాని ఇచట ప్రతిదినము నీయాగడములతో తల బొప్పికట్టుచున్నది. నిత్యము నేదో యొక తగాదా తెచ్చి పెట్టుచుండును. నీవు మాత్రమెంతకాలమని సహింపగలవు."

"చిన్నతనముగదా! కొంతకాలమిట్లే యోపిక పట్టవలెను."

ఆ దినమంతయు రాముఁడింటికి రాలేదు. ఆ బాలుని పేరు రామలింగము. రాముఁడనునది యింటిలోనివారు పిలుచు పేరు. తల్లి, మేనమామ యాతని కొఱకెదురుచూచిరి. చీకటి పడినను బాలుఁడింటికి రాలేదు. మేనమామకు భయమైనది. బాలుఁడేమైనాఁడో! తల్లి మనసులో కుమిలిపోవుచున్నది.

రాత్రిజాము ప్రొద్దెక్కిన తరువాత నాతఁడింటికి వచ్చినాఁడు. మేనమామ మాటాడలేదు. తల్లి స్నానము చేయించి భోజనముపెట్టినది. భోజనమైన పిమ్మట బాలుని గూర్చుండబెట్టి చీవాట్లు ప్రారంభించినది. మేనమామ మాటాడక మంచముపైఁ బరుండి వినుచున్నాడు.

"నాయనా! నీవు పెద్దవాఁడవగుచున్నావు. మీ మామయ్య యుపనయనము గూడ చేసినాఁడు. చదువు సంధ్యలు మాని వీధులవెంట తిరుగుచు పిల్లలను కొట్టుచున్నావు. వారందఱు నీ మామ యింటిపైకి దాడి వెడలుచున్నారు. నేడు వీధి యంతయు నీ మామ పై దండెత్తి వచ్చినది. బ్రాహ్మణకులమున జన్మించితివి. వేదశాస్త్రాధ్యయన మొనర్చి కులగౌరవము నిలువబెట్టవలెగాని యిట్లు పలుగాకి మూకలతో పోకిరిపనులు జేయుచు తిరుగుట తగునా? నీ తోడివారందఱు చదువుసంధ్యలతో దల్లితండ్రులను మురిపించుచుండ నీ వేదియు లేక యిట్లు తిరుగుట మంచిదికాదు."

తల్లియొనర్చిన హితోపదేశమునకు రామలింగము మాఱుమాటాడక విధేయునివలె నిలువఁబడి వినినాఁడు.

తెల్లవారినది. రామలింగము మఱల వీధిలో నికిబయలు దేరినాఁడు. త్రోవలో కనబడినవారినెల్ల పరిహసించును. వారిపైఁ బద్యములల్లును. పాటలుపాడును. పిల్లలతో గలసి యాడును. మధ్యాహ్నమైనది. ఎండ తీవ్రముగ నున్నది. ఊరుబయట నున్న చింతతోఁపులో నాటలాడి యాడి

యచటనే చెట్టుక్రింద నిదుర బోయినాఁడు. చెలికాండ్రెవరి యింటికి వారేగిరి.

ఆతడు నిదురలేచి చూచునప్పటికచట నెవరును లేరు. లేచి యింటిత్రోవపట్టినాడు. పదియడుగులు నడచినంతనే యొక చెట్టుక్రింద నొకవృద్ధుఁడు ధ్యానస్తిమితలోచనుఁడై పడి యుండెను. రామలింగమాతని వద్దకేఁగి చూచినాఁడు. ముండితశిస్కుఁడు, కౌపీనధారి, తేజోవిరాజితుఁడైన త్రిదండి ! మరణవేదన ననుభవించువానివలెనున్నాడు. రామలింగని కాతనిఁ జూచినంతనే జాలికలిగినది. స్వామీ ! ఏమి కావలె నని ప్రశ్నించినాడు. ఆ యోగి కమండలువు వైపు సంజ్ఞ చేసినాఁడు. కమండలువులో నీరులేదు. రామలింగము పరు గునఁ బోయి నీరుగొనివచ్చి యోగీశ్వరుని గొంతులోబోసి నాఁడు. ఆతఁడొక గుటకవైచి కనులుతెఱచినాడు. ఎదుట నున్నబాలుని చూచినాడు. ఆతని యజ్ఞోపవీతమును జూచి నాడు. బ్రాహ్మణ బాలకుఁడని నిశ్చయించుకొని కూర్చుండు మని సంజ్ఞచేసినాఁడు. రామలింగమాతని సమీపమునఁ గూర్చుండెను. యోగి యస్పష్టభాషణముల నిట్లనెను—

'నాయనా ! నీవెవరవో తెలియదు. నాకనేకమంది శిష్యులున్నారు. నాకుభక్తితాత్పర్యములతో శుశ్రూష చేసినవారున్నారు. కాని నా యీ యవసానసమయమున వారెవరును నావద్ద లేరు—వారు దురదృష్టవంతులు. నీవదృష్ట వంతుఁడవు. నాకవసానకాలము సమీపించినది. నేను మంత్ర

సిద్ధుఁడను. కాళీయుపాసకుఁడను. నాతోఁబాటా మంత్రము వ్యర్థమగుట నాకిష్టములేదు. తన విద్యలనొరులకుపదేశింపక తనతో నంతమొందించువాడు బ్రహ్మరాక్షసుడగునని శాస్త్రము చెప్పుచున్నది. కావున నేను నీకామంత్రముపదేశింతును. తన్మాహాత్మ్యమున నీవు కాళికాదేవిని సాక్షాత్కరింపజేసికొనగలవు. శీఘ్రమే స్నానమొనర్చి రమ్ము."

రామలింగమామాటలు విని బాల్యచాపల్యమున విశ్వసింపకున్నను తన్మాహాత్మ్యమేమో చూతమని స్నానమొనర్చి యాయోగి చెంతఁ గూర్చుండెను. యోగి మరణాసన్నుఁడై యుండియు లేని యోపికఁ దెచ్చుకొని యాతని కాదేవీమంత్రముపదేశించి యిట్లనెను—"వత్సా! నీవీ మంత్రమును వారమ్ముదినములలో లక్షపర్యాయములు జపింపుము! నీ కాదేవి ప్రత్యక్షమై యభీష్టమొసఁగూర్పఁగలదు. నాకు నిర్యాణకాలము సమీపించినది. శిష్యుఁడవైన నీవే యీభౌతికశరీరమును ఖననమొనర్చి సంస్కారమొనర్పుము."

రామలింగమునకు మంత్రోపదేశమొనర్చిన కొలఁది సేపటికే యాసిద్ధుఁడు పరమపదించెను. ఊరిలోని వారందఱు నేతెంచి యాతని ఖననసంస్కారాదికములు జరిపించిరి. రామలింగమునకిపుడు సిద్ధుడు తనకుపదేశించిన మంత్రప్రభావము నెఱుంగవలెనని బుద్ధిపుట్టినది. ఆతనికిఁ బట్టుదలయెక్కువ. ఆతనికేకాదు; సామాన్యముగనట్టి స్వభావము గలవారందరికిని బట్టుదల యెక్కువగనే యుండును. రామలింగము శుచియై

గొకదేవాలయములోనికేఁగి జపము ప్రారంభించెను. భక్త పరాధీన గావున నాదేవి బాలభక్తుని పట్టుదలకును భక్తిని మెచ్చి ప్రత్యక్షమైనది. రామలింగము భక్తిప్రపత్తులతో చేతులుజోడించి నిలువఁబడియుండెను.

అప్పుడా దేవి యొకచేతిలోనున్న స్వర్ణపాత్రను, వేఱొక చేతియందున్న రజతపాత్రను జూపి, 'స్వర్ణపాత్రలోఁ బాలును, రజతపాత్రలోఁబెరుగునున్నవి. పాలుత్రావినచో విద్యయు; బెరుగుత్రావినచో ధనమునులభించును. ఇందు నీకేదికావలెనో కోరుకొమ్ము' అనెను.

అందులకాతఁడు 'దేవీ! నాకు వానియందలి విశేషము లేర్పరంపరాకున్నది. చూడనిత్తువేని కలతెఱంగెరిగింతును' అనెను. దేవి తనచేతులందున్న రెండు పాత్రలను రామలింగని కిచ్చెను. అతఁడు రెంటిని మ్రింగి 'తల్లీ! రెండును రుచ్యంబులే! కావున రెంటిని గ్రోలితిని. కోపింపకు' మనెను.

అందుకా దేవి యించుకకోపించి—'ఓయీ! నా యాజ్ఞనుల్లంఘించితివిగాన విద్వాంసుఁడవయ్యును వికటకవి వగుదువుగాక!' యనిశపించెను. రామలింగ మాతల్లిని ప్రార్థింపగా నామె యించుక కరుణించి—'వికటకవివయ్యును రాజ సమ్మానమును బొందుదువుగాక!' యని మాయమయ్యెను.

రామలింగడింటికివచ్చి యథాపూర్వముగనాట పాటలలో మునిగియుండెను. అప్పుడప్పుడు పద్యములల్లును. భట్టువాంఛతో స్నేహమొనర్చి వారితోగలసి పద్యములం చెప్పు

చుండెను. ఆతని పద్యరచనాశక్తికి గ్రామములోని వారా శ్చర్య చకితులగుచుండిరి. రామలింగడిట్లు స్వేచ్ఛా వర్తనుఁడై కాలముగడపుచుండెను.

పెద్దవాఁడగుచున్న కొలఁదియు నాతని కవితాశక్తియుఁ వృద్ధిగాంచెను. జీవనోపాధికై రాజాశ్రయము సంపాదింపవలె నని తలంచెను. కవితాశక్తిచే, పాండిత్య ప్రకర్షచే రాజులను మెప్పించి వారి యాశ్రయముఁ బొందిననేగాని కవులకు, పండితులకు జీవయాత్ర సాగుటెట్లు? రాజాశ్రయము లభింపవలె నన్న రాజాస్థానముననున్న పెద్దలను ప్రసన్నుల నొనరింప వలెను. అందుచే రామలింగము రాజగురువై యుండిన తిరుమల తాతాచార్యులవారి నాశ్రయింపనెంచెను. ఈ తాతాచార్యులనే లక్షగోదానముల తాతాచార్యులనియు, కన్యాదానము తాతాచార్యులనియు నందురు. తాతాచార్యుల వారు గొప్పవిద్వాంసుఁడు, ధర్మాత్ముఁడు, వైష్ణవమతము నందు మిక్కిలి యభినివేశము గలవాఁడు. రాజగురునై, రాజులయండతో నసంఖ్యాకులను చక్రాంకణాదులతో వైష్ణవులనుగా మార్చెను.

రామలింగడు రాజసందర్శన భాగ్యమును బొందుటకై తాతాచార్యులను దర్శించెను. తాతాచార్యులు రామలింగనికి రాజదర్శనలాభము గలుగ జేతునని చెప్పెను. తాతాచార్యుల ప్రోత్సాహమున నాతఁడు వైష్ణవమును సైతము స్వీకరించి తనపేరు రామకృష్ణుఁడుగా మార్చుకొనెను. తాతా

చార్యుడు రామలింగని, రామకృష్ణుఁడుగా మార్చినేగాని యాతనికి రాజదర్శన భాగ్యము కలిగింపక కాలయాపన మొనర్చుచుండెను. రామకృష్ణుఁడు విసిగి తాతాచార్యుల మోసమునకుఁ దగిన ప్రతీకార మొనర్పవలెనని నిశ్చయించుకొని యొకనాఁడాతఁడు విజన ప్రదేశమునఁ గాలోచితముల కేఁగిన సమయమున నాతనిని వేధింపఁజొచ్చెను. తాతాచార్యులు రామకృష్ణుని మాటలకు చేతలకు దుఃఖించుచు సామోపాయమున నాతనిని లోఁగొననెంచి 'నాచే నీయిష్టము వచ్చిన కార్యముఁ గొను'మనెను. అంతట రామకృష్ణుఁడు 'తాతా! నన్ను నీమూపున నెక్కించుకొని మాయింటవిడచి రమ్ము' అనెను. గత్యంతరములేక తాతాచార్యులాతనిని మోసికొనిపోవుచుండెను. ఇట్లు తాతాచార్యునిపై నెక్కియున్న వానిని రాజసౌధముననున్న రాజుగాంచి, తన సేవకులకు వారిని జూపి 'పైనున్నవానిని క్రిందకుఁద్రోసి తీసికొని రండు' అని పంపెను.

రామకృష్ణుఁడిది గ్రహించి, పైనుండిదిగి తాతాచార్యులతో— 'దేశికోత్తమా! నావలనఁదప్పైనది. క్షమింపుఁడు. నేనొనర్చిన పాపమునకు మిమ్ము నాభుజములపై నెక్కించుకొని మోసినగాని నిష్కృతిలేదు!' అని బ్రతిమాలి యాతనిని తన మూపున నెక్కించుకొని నడుచుచుండెను. ఇంతలో రాజభటులుపైనున్న తాతాచార్యులను గ్రిందికిఁద్రోసి రాజ సమక్షమున కీడ్చుకొని పోయిరి. రాయలు గురువునుగాంచి

పశ్చాత్తప్తుడై యాతనివలన జరిగిన యుదంతముఁ దెలిసికొని రామకృష్ణుని రావించి యాతనికి శిరచ్ఛేదనమును శిక్షగా విధించెను.

రామకృష్ణుఁడు వధికులకుఁగొంత ధనమిత్తునని యాశ గొల్పి విముక్తుఁడయ్యెను. వారును మేక నొకదానిని జంపి రక్తసిక్తమైన కరవాలమును రాజునకుఁ జూపిరి. రామకృష్ణుఁడు మరునాడు తల్లి వద్దకేఁగి జరిగిన యుదంతముఁజెప్పి 'రేపు నీ వేడ్చుచు రాజునొద్దకేఁగి పుత్రశోకమును బ్రకటింపుము. పుత్రహీనతవలన గ్రాసవాసోదైన్య మేర్పడినదని విన్నవింపుము. రాజు మనకు గొంత ధనమిచ్చును. ప్రస్తుతము దానితో జీవయాత్రసాగుచుండును' అని చెప్పెను. ఆమెయు మఱునాఁడట్లే రాజసభకేఁగి రాజునకుఁ దనదైన్యస్థితిని విన్నవించుకొనెను. రాయలామెకుఁ గొంతధనమిచ్చి మాసవేతనమును నియమించెను. రాయలు పుత్రహీనయగు తల్లిని గాంచి పశ్చాత్తప్తుఁడై చాల దుఃఖించుచుండెను. బ్రహ్మహత్యాపాతకముఁ గట్టుకొంటిమి గదాయని భీతినందుచుండెను.

తనపై రాజునకుఁగల కోపము పూర్తిగ తగ్గినదని నిశ్చయించుకొని రామకృష్ణుఁడు మఱల రాజదర్శనమునకుఁ బ్రయత్నింపసెంచెను. రాయలొకనాఁడు సభాభవనమున నున్న సమయమున రామకృష్ణుఁడు తిరుమణిదీర్చి పీతాంబరముగట్టి తులసిపూసలుదాల్చి వైష్ణవవేషమున రాజసభకు

బయలుదేరెను. రాజభవనము వాకిట పండితాగమనమును సూచించు గంటగలదు. పండితులై రాజదర్శనమును గాంక్షించువారు తాము నేర్చిన విద్యలెన్నియో యన్ని సారులు దానిని బ్రయోగింతురు. రామకృష్ణుఁ డదేపనిగ గంట బ్రయోగించుచుండెను. ఆస్థానమున నున్న రాజును, సభ్యులును నూత్నపండితుని అనంతశాస్త్ర పాండిత్యమున కబ్బుర పడుచుండిరి. రాజాజ్ఞ ననుసరించి దౌవారికులు రామకృష్ణుని సభాభవనమునఁ బ్రవేశపెట్టిరి.

రాయలు రామకృష్ణునిఁగాంచి—'అయ్యా! మీరెన్ని విద్యలు నేర్చితిరి? ఏ యే విద్యలలో పరీక్షింపబడుటకు అంగీకరింతురు?' అని ప్రశ్నించెను.

రామకృష్ణుఁడు—'ప్రభూ! నేను నేర్చిన విద్యలనన్నిటిని పేర్కొనుట కష్టము. విద్యకొక్క దెబ్బచొప్పున గొట్టినచో మీరేర్పఱచిన గంట బ్రద్దలై పోవును' అనెను.

రాయలును సభాసదులును రామకృష్ణుని మాటల కాశ్చర్య చకితులైరి. నేటివఱకిన్ని విద్యలలోఁ బండితుఁడైనవాడు రానేలేదు. ఈతని వయసు చూతమా యిరువది యేండ్లకంటె మించినట్లు కన్పట్టదు. ఇంత చిన్న వయస్సులో నిన్ని విద్యలందాఱితేరుట ఆశ్చర్యము! అది యటుండ నిప్పుడీతనిని పరీక్షించువారెవరు? కవితా పితామహులే యందుకుఁ దగినవాఁడని నిశ్చయించి యానూతన విద్వాంసుని మీ యిష్టమువచ్చిన విద్యయందు పరీక్షింపుఁడనెను.

అల్లసాని పెద్దనామాత్యుఁడాలోచనలో మునిఁగెను. ఆస్థానకవీశ్వరులు కొందఱు జ్యోతిష శాస్త్రమున నీతనిని బరీక్షింపుడని పెద్దన చెవిలో నూదిరి. పెద్దన యించుక ఆలోచించి రామకృష్ణునీవిధముగ బ్రశ్నించెను—'ఓయీ! నీవు వయసున జిన్నవాఁడవైనను బహువిద్యాపారంగతుఁడవు. కావున నీజ్యోతిషశాస్త్ర ప్రజ్ఞ వ్యక్తమగునట్లు ఈసమయమున స్వర్గలోకమున జరుగుచున్న విశేషములను వివరింపుము!'

రామకృష్ణుఁడొక్కింత సేపు ధ్యానస్థిమిత లోచనుఁడై మిన్నుఁజూచుచు, మనసులోనిష్ట దైవమును ధ్యానముసేసి వ్రేళ్లులెక్కించి, యిట్లనెను—"సార్వభౌమా! ఇపుడు నాక లోకమున దేవేంద్రుఁడు కొలువుదీర్చియున్నాడు. ఆతని యెదుట రంభాద్యప్సరసలు నృత్యమొనరించు చున్నారు. అదిగో! రంభపాదనూపురమొకటి జాఱినది. అది త్వరలో మన సమీపమునబడును. ఈ విషయము శాస్త్రముననుసరించి నిజమేయైనను జ్యోతిషమునకు పార్వతీదేవి శాపముండుటవలన నది జరుగవచ్చును, జరుగకపోవచ్చును."

ఇట్లని మిన్నకున్నంతనే నూపురమొకటి సభాస్థానమునఁబడెను. సభ్యులును రాయలును దానినిగాంచి రామకృష్ణుని ప్రజ్ఞావిశేషములకు సంతసించిరి. రాయలాతనిని గౌరవించి యాస్థానకవి గౌరవమును బ్రసాదించెను. నాటి నుండియు రామకృష్ణుఁడు రాజసభకేఁగుచు తన చమత్కార

ములచే రాజును, సభ్యులను రంజింపఁ జేయుచుండెను. వయసున పిన్నవాఁడైనను ప్రతిభావంతుఁడగుటచే నాస్థాన విద్వాంసులు పైతమాతనని గౌరవించుచునే యుండిరి.

కృష్ణదేవరాయలు కవితాసార్వభౌముఁడు. విద్వజ్జన పరిశ్రమమెఱిగిన రసజ్ఞుఁడు. కవితాగోష్ఠియున్నచో నాతనికి నిద్రాహారము లక్కఱలేదు. ఒకనాడు రాయలు సభలోని విద్వాంసులను కవులను సంబోధించి యొకవరాల పళ్లెరముఁ జూపి యిట్లనెను— 'ఈ సభలోని పండితుఁలెవరైనను నిర్దోష ముగాఁ బద్యము, జెప్పి యీ పళ్లెరమందు కొనుడు.'

సభలోని పండితులందఱును పెద్దన యుండగా ముందుగా తామందులకుఁ బూనుకొన వెఱచి మిన్నకుండిరి. పెద్దన లేచి తనపద్య మిట్లు చదివెను-

మ. శరసంధాన బలక్షమాది వివిధైశ్వర్యంబులంగల్గి దు
ర్భర షండత్వ బిలప్రవేశచలన బ్రహ్మఘ్నతల్ మాని
నన్
నరసింహక్షితి, మండలేశ్వరుల నెన్నన్వచ్చు నీసాటిగా
నరసింహక్షితి మండలేశ్వరుని కృష్ణా! రాజకంఠీరవా!

సభాసదులు సంతోష సూచకముగ చప్పట్లు చఱచిరి. రామకృష్ణుఁడులేచి పెద్దన నుద్దేశించి—' తాతా! బిలముఁ బ్రవేశించినను రాజకంఠీరవా! రమ్మనితోఁకబట్టి వెలికీడ్చు చున్నావు. బిలప్రవేశదోషమున్నది సింహామునకంటివి. మఱి రాజ కంఠీరవా! యంటివేమి? ఇది దోషముకాదా?' యనెను.

సభాసదులు నిర్విణ్ణులైరి. రాయలకు రామకృష్ణుని యుక్తిలోని యౌచిత్యము వ్యక్తమైనది. అల్లసాని పెద్దన మాటాడలేదు. సభ్యులు తప్పులెన్నుట తేలికయే పద్యము జెప్పి యొప్పించుట కష్టమనుకొనుచుండిరి. అప్పుడు రాయలు బాలకవియైన రామకృష్ణునిగాంచి— 'ఏదీ! దోష రహితమైన పద్యమును మీరు జెప్పు'డనెను.

రామకృష్ణుఁడు తనపద్యమునిట్లు చదివెను—

మ. కలనందావకఖడ్గ ఖండిత రిపుక్ష్మాభర్త మార్తాండమం
డలభేదంబొనరించియేఁగు నెడఁ దన్మధ్యంబునన్ హారకుం
డలకేయూరకిరీట భూషితుని శ్రీనారాయణుంగాంచి లో
గలగం బాఱుచునేఁగె నీవయను శంకం గృష్ణరాయాధిపా.

సభ్యులతోబాటు పెద్దనయు, రాయలునుగూడ కర తాళధ్వనులొనర్చిరి. రాయలు వరహాలున్న పళ్లెరమును రామకృష్ణుని కందించెను. నాటినుండి రాయల సభలో నాతనికి గౌరవాదరము లధికమయ్యెను. రామకృష్ణుఁడును తన చమత్కారములతో సభ్యులను రంజింపజేసెడివాఁడు. ఒక్కొక్కప్పుడాతని మాటలు చేతలు కోపకారణములగుచుండినను నాతని ప్రజ్ఞావిశేషములనుదలచి యందఱునూ సహించు చుండిరి.

ఒకనాడు రాయలు ధూర్జటి కవిత్వమునకు మెచ్చి యాస్థాన విద్వాంసులనుఁ జూచి—

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేల కల్గెనీయతులితమాధురీ మహిమ?"

యని ప్రశ్నించి సమాధానమునకై వేచియుండెను సభ్యులెవ్వరును మాటాడలేదు— ఆ పద్యమును బూరింపలేదు. రామకృష్ణుని కింకను చిన్నతనపుఁ జేష్టలు పోలేదు పెద్దలొనర్చు తప్పులను వెదకుచునే యుండెను. ధూర్జటి వేశ్యాలోలుఁడని యాతనికిఁదెలియును. ధూర్జటి వేశ్యయింటి కేఁగి వచ్చుచుండుటను రామకృష్ణుఁడు చూచియుండెను. రాయలకీవిషయము తెలియదు. ధూర్జటిశివభక్తుఁడు. పరమ మాహేశ్వరుఁడు. ఆతనియందీదోషమున్నదని యెవ్వరికిని దెలియదు. రామకృష్ణుఁడులేచి రాయలిచ్చిన సమస్యనిట్లు పూరించెను —

………………హా తెలిసెన్, భువనైక మోహనో
ద్ధత సుకుమారవారవనితా జనతా ఘనతాపహారి సం
తత మధురాధరోదిత సుధారసధారలఁ గ్రోలుటంజుమీ.

ఈ మాటలకు సభలో సహస్రకమలములు వికసించినవి. రామకృష్ణుని పరిహాసమున ధూర్జటి స్వభావము, యాదార్థ్యము మఱుఁగునఁబడి పోయినవి. ధూర్జటిస్మితము నవ్వెను. పిమ్మట కోపించినఁ గోపించుగాక !

ఒకనాఁడు ప్రెగడరాజు నరసన్నయను కవి రాయల యాస్థానమునఁ దనవిద్యను బ్రదర్శింపవలెనని శిష్యసమేతుఁడై యేతెంచెను. ఆతనికి సహస్ర ఘంటకవి యనుబిరుద ముండెను. వాదమునకు సహస్రఘంటకవి యేతెంచినాఁడన్న మాటవిని యాస్థాన విద్వాంసులు భయమంది రామకృష్ణుని

యింటికేఁగి నేటికీముప్పు తప్పింపుమని కోరిరి. రామకృష్ణుని కిట్టి సన్నివేశములే కావలెను. ఆతని సంతోషమినుమడించెను. తానాసహస్రఘంటకవి నోడింతునని చెప్పి యిట్లనెను— 'మీరు రాయలతో రామకృష్ణుఁడు కార్యాంతరమగ్నుఁడై గ్రామాంతమేగెననియు, నేఁడు సభకురాడనియుఁ దెల్పుఁడు. మీదికార్యము నేను జూచుకొందును."

పండితులను బంపివేసి రామకృష్ణుడు తన వేషమును గుర్తించుటకు వీలుగాకుండ మార్చుకొని రాజసభకేగెను. సభలో సహస్ర ఘంటకవి తన ప్రజ్ఞావిశేషములను వెల్లడించుచుండెను. ఇంతలో ద్వారపాలకుఁడొకడేతెంచి— 'లక్షఘంటకవియట దేవరదర్శనమునకు వేచియున్నారు' అనెను. రాయలు పండితాగమనమునకు సంతసించి సగౌరముగ దోడ్కొని రమ్మనెను. లక్షఘంటకవి యనినంతనే సహస్రఘంటకవికి భయము కల్గెను. ఇంతలో లక్షఘంటకవి లోనికేతెంచెను. రాయలాతనిని గూర్చుండ నియమించి వాదమును ప్రారంభింపుఁడనెను.

లక్షఘంటకవిలేచి పెగడరాజు నర్సననుజూచి— 'ఓయీ! సహస్రఘంటకవివైన నీతో వాదించు నవకాశము లభించుట నాసుకృతము. నాకొకటి రెండు సందియము లున్నవి. తీర్పఁగలవా?'యని ప్రశ్నించెను.

నర్సనయించుక భయపడి– 'మీ సందేహములు దీర్చునంతటివాఁడను. కాను. అయినను నాకొసాపినగోలఁది యత్నింతు' ననెను.

ఇదివిని లక్షఘంటకవి— 'పండితోత్తమా! నాకింత వఱకు నుక్తలేఖనమునను, తప్పులు దిద్దుట యందును దిట్ట యైనవాఁడు కానరాలేదు. మీరలవినేర్తురా?' యనెను.

ఈ ప్రశ్నకు నర్సన లోలోన నవ్వుకొని, లక్షఘంట కవియింత మాత్రపు వాఁడేనాయని లోననుకుని యిట్లనెను— 'ఆర్యా! గొప్ప సంశయములనే ప్రకటించితిరి. ఉక్తలేఖనము నకును, తప్పులుదిద్దుటకును నేనక్కఱలేదు. నాశిష్యులే చాలుదురు. ఈమాత్రము చేతగానివాఁడు పండితుఁడెట్లగును?'

అహంభావపూరితములైన నర్సనపలుకులాలించి రామకృష్ణుఁడు – 'అయ్యా! నేను చెప్పఁబోవు పద్యమును వ్రాసి తాము తమ సామర్థ్యమును బ్రకటించి సభను రంజింపఁ జేయవలసినదిగా బ్రార్థించుచున్నాను.' అని యాకును ఘంటమును నందిచ్చి—

త్ప్ర్వ్వఁట బాబా, తలపైఁ
బువ్వఁట జాబిల్లి, వల్వబూచట, చేదుం
బువ్వట, చూడగ నుళుళు
క్కవట, యరయంగ నట్టి హరునకు జేజే

యని మొదటి యక్షరమును విలక్షణముగ నుచ్చరించి వేగముగ బద్యముఁ బూర్తిచేసి వ్రాయుడు వ్రాయుఁడ'ని తొందర పెట్టసాగెను. నర్సన విలక్షణోచ్చరితమైన మొదటి యక్షరమును మఱలకుఱల వ్రాసి తుడుపులు పెట్టుచుండెను. రామ

కృష్ణుఁడదిగాంచి—'పండితోత్తమా! మీ పాండిత్యము వ్యక్తమైనది. చాలును. ఇఁక తప్పులు దిద్దుటయందు మీకుఁ గల సామర్థ్యమును ప్రదర్శింపుఁడు' అని పద్యముఁజదివెను—

మ. గననీహారాగు రామ పద్మధళ రంగత్కీర్తి చాణూర మ
ద్ధన శుక్రాక్షి కళేభరాణ్మృగపతీ త్రైలోక్య ధామో
దరా
యనఁగా శంఖర వాంఛితార్థదగదాద్య స్త్రైక పాణీజనా
ర్దన వానేకపవైరి విగ్రహము కుంధామిత్రవింధాధిపా.

ఈ పద్యమును జూచి నర్సన తప్పులుగా కన్పట్టుచున్న 'చాణూరమద్ధన' యనుదానిని చాణూర మర్దన యనియు,'కళేభరమ'అనుదానిని కళేబరమనియు,'ధామోదర' యను దానిని దామోదరయనియుఁ దనకుఁ దోఁచినట్లు దిద్దెను. రామకృష్ణుఁడు చాణూరమత్+హన, యనియు, కళ+ఇభరాట్ అనియు, ధామ+ ఉదరయనియు తాఁజెప్పిన శబ్దములను సమర్ధించి యొప్పించెను. నర్సన సిగ్గుచే తలవంచి నిలువఁబడియుండెను. రామకృష్ణుఁడాతనింగాంచి—

చ. తెలియనివన్ని తప్పులని దిట్టతనాన సభాంతరంబునన్
బలుకఁగరాకురోరి పలుమాఱుపిశాచపు పాడగట్ట! నీ
పలికిననోట దుమ్మువడ! భావ్యమెఱుంగక పెద్దలైన వా
రల నిరసింతురా ప్రెగడరాణ్ణరసా! విరసా!. తుసా భుసా.

చ. ఒకని కవిత్వమందెనయు నొప్పులు తప్పులు; నాకవిత్వ మం
దొకనికిఁ దప్పుపట్టు పనియుండదు; కాదనితప్పు పట్టినన్

మొకమటు క్రిందుగా దిగిచి మొక్కలు పోవనినుంప కత్తితో
సిక మొదలంటఁగోతు, మఱిచెప్పన గొట్టుదు మోము తన్నుదున్.

అనుచు రామకృష్ణుఁడు వేషమూడ్చి స్వస్వరూపమును బ్రదర్శించెను. రాయలును, సభాసదులును, నర్సనయు నాశ్చర్యచకితులైరి. రామకృష్ణుఁడు రాయలనుగాంచి—'ప్రభూ! పండితమానియైన నర్సన కాలికిగండ పెండేరముండదగునా?' యనెను. ఈమాట లాలించిన వెంటనే నర్సన తనగండ పెండేరమునుదీసి రామకృష్ణుని కర్పించెను. సహృదయుఁడైన రాయలు వారిరువురిని యథార్హముగ సంభావించెను.

ఒకనాఁడు భట్టుమూర్తి కృష్ణదేవరాయలను నుతించుచు నీక్రింది పద్యముఁ జెప్పెను.—

నరసింహ కృష్ణరాయని
కరమరుదగుకీర్తి యొప్పెఁ గరిభిద్గిరిభిత్
కరికరిభిద్గిరి గిరిభిత్
కరిభిద్గిరి భిత్తురంగ కమనీయంబై

ఈ పద్యమునువిని రాయలు తనడమెలోని ముత్యాలహారమును భట్టుమూర్తి కొసంగి సత్కరించెను. సభలోనున్న పండితులిట్లు భట్టు కుఱ్ఱవాఁడౌటఁడు రాజుచే ఘనసన్మానము నందుటచే నసూయాగ్రస్తులైరి. ఆ భట్టు ప్రతిదినమును ముత్యాలహారము వేసికొని సభకువచ్చుట వారికి సహింప

రానిదై రామకృష్ణునితో నెట్లైనను ఆ ముత్యాలహారమును హరింపుమనికోరిరి. రామకృష్ణుడొకనాడు భట్టుమూర్తితో మాట్లాడుచు నాతని ప్రజ్ఞావిశేషంబు లుగ్గడించుచు నిట్లనెను.

ఆ. వె. అలసాని పెద్దన యల్లిక జిగిబిగియు
ముక్కుతిమ్మనార్యు ముద్దుపల్కు
పాండురంగవిభుని పదగుంభనంబును
కాకమానురాయ! నీకుఁదగుర.

రామకృష్ణుని ప్రశంసకులోనలరి భట్టుమూర్తి తన మెడనున్న ముత్యాల హారమును రామకృష్ణుని మెడనిడి కౌగలించుకొనెను.

రామకృష్ణుఁడు భట్టుమూర్తిని పొగడి యాతనివద్ద నున్న ముత్యాలహారమును గొనుటవిని కవులు రామకృష్ణునితో— 'ఓయీ! భట్టుమూర్తినుండి హారమును హరించుట మా కిష్టమే! కాని, యాభట్టునట్లు ప్రశంసించుటకు నీకెట్లు బుద్ధిపొడమెను?' అనిరి.

రామకృష్ణుఁడు—' అయ్యలారా! నేను భట్టును పొగడలేదు. భట్టుమూర్తితోబాటు మీరుగూడ పొగడితినని భ్రమించిరి. వినుఁడు' అనుచు పైపద్యమున్ను 'పదగుంభ నంబునగాక' అని కలిపి 'మానురాయనీకుఁధగుర' అని చదివెను. నీ యభిప్రాయమును వివరింపుమని పండితులు కోరఁగా. రామకృష్ణుఁడు —'భట్టుమూర్తి కి వీపున తామరయున్నది.

ఆతఁడెల్లప్పుడు తన వెనుకనున్న స్తంభమునకు వీపురాయు చుండును' అని చెప్పి నవ్వించెను.

ఒకనాడు ప్రస్తావవశమున నల్లసాని పెద్దన రాజసభలో నీక్రింది పద్యమును చదివెను—

క. కలనాటి ధనము నక్కఱ
గలనాటికి దాఁచఁగ మలగర్భునివశమా
నెలనడిమినాఁటి వెన్నెల
యలవడునే గాదెఁబోయ నమవసనిసికిన్

ఈ పద్యమును రామకృష్ణుఁడు విని 'అమవసనిసికిన్' అనుచోట శబ్దసౌష్టవము లేదనియెంచి యిట్లనెను—

క. ఎమిదిని సెపితివి కపితము
ఉమితః కయదినియు సెపితివో కయితప్పై త్తె
బ్బెమెతిని సెపితివో కపితము
అమవసనిసి యనుచు నీవు అలసనిపెదనా!

ఈ మాటలకు సభలోని వారందఱును విఱుగబడి నవ్విరి. పెద్దనయు దనపద్యమున యదార్థముగ తప్పులేమిం జేసి రామకృష్ణుఁడు వేళాకోళమున కనినమాటలని నవ్వి యూరకుండెను. రామకృష్ణుఁడు కాళికాదేవీ వరప్రసాద లబ్ధుఁడై కవితావినోదముల వికటకవియై సభలోని వారలను రంజింపఁ జేయుచుండెను. అల్లసాని పెద్దన, ముక్కుతిమ్మన మొదలైన పెద్దలాతనిని బాలుఁడనియు వృద్ధిలోనికి రాదగిన

వాఁడనియు నెంచి వాత్సల్యముతో నాతని యాగడములను సైతము సహించిరి.

రాయలొకనాఁడు పండితగోష్ఠి యందుండి సభ లోని పండితులఁజూచి పెద్దన, తిమ్మన, రామరాజ భూషణుల కవితా విశేషములను తెల్పుఁడని యడిగెను. సభలోని పండి తులు తమకుఁదోచినరీతి నా ముగ్వురి కవిత్వములందలి భేద సాదృశ్యములను విశదీకరింపసాగిరి. చివఱకు రామకృష్ణుఁడు లేచి "ప్రభూ! వీరందఱన్ని విధములుగాఁ జెప్పినారు. నా యభిప్రాయ మొక్క మాటలోఁ జెప్పెదను. చిత్తగింపుఁడు. అల్లసాని పెద్దన. 'యట్టిట్టులేడ్చెను' 'ముక్కుతిమ్మన' 'ముద్దు ముద్దుగ నేడ్చెను' భట్టుమూర్తము 'బావురుమనియేడ్చెను.' అనిచెప్పి మిన్నకుండెను. అంతట రాయలు రామకృష్ణు నుద్దే శించి నీ యభిప్రాయమును విశదీకరింపుమని కోరెను. అప్పుడు రామకృష్ణుఁడు మనుచరిత్ర, పారిజాతాపహరణము, వసు చరిత్రములలో నా కవులు రచించిన పద్యములనిట్లు వరుసగ చదివెను.

ఉ. పాటున కింతలోర్తురె కృపారహితాత్మక నీవు ద్రోయ ని
చ్చోటఁ భవన్నఖాంకురము సోఁకెఁగనుంగొనుమంచుఁ
జూపి య
ప్పాటలగంధి వేదననెపంబిడి యేడ్చెఁగలస్వనంబుతో
మీటిన గబ్బిగుబ్బచను మిట్టలనశ్రులు చిందువందగాన్.

— మనుచరిత్రము

ఉ. ఈసునబుట్టిడెందమున హెచ్చినశోక దవానలంబుచే
గాసిలియేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీ సఖమైనమోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాస కషాయ కంఠకలకంఠ వధూకల కాకలీధ్వనిన్

— పారిజాతాపహరణము

శా. ఆ జాబిల్లి వెలుంగు వెల్లి కలడాయన్ లేక రాకానిశా
రాజ శ్రీసఖమైన మోమునఁ బటాగ్రంబొత్తి యొత్తియా
రాజీవాననయేడ్చెఁ గిన్నర వధూరాజత్కరాంభోజ కాం
భోజీమేళవిపంచి కారవ సుధాపూరంబు తోరంబుగాన్

— వసుచరిత్ర

రామకృష్ణుని విమర్శకు సభ్యులు కరతాళధ్వనులతో నవ్వసాగిరి. ఆతనిసూక్ష్మబుద్ధి కాశ్చర్య చకితులై మెచ్చిరి. రామకృష్ణుఁడు చమత్కారప్రియుఁడు. కాని యొక్కొక్కపుడా చమత్కారము హద్దుమీఱినట్లు కన్పట్టును. ఒకనాఁడు ముక్కుతిమ్మన తన యింటిలో బంగరుటూయెలపై గూర్చుండి యుండెను. ఆ సమయమున కే రామకృష్ణుఁడచటి కేతెంచెను. ఊయలపై నున్న తిమ్మనను గాంచినంతనే రామకృష్ణుడు తనహాస్యధోరణి వ్యక్తమగునట్లు 'తాతా! ఊతునాళీ' యనెను, తిమ్మన 'ఊతునాళీ'యనుశబ్దమునకు సందర్భము ననుసరించి యర్థమును భావించి సరేయనెను. రామకృష్ణుఁడు వెంటనే తుపుక్కున నుమిసెను. తిమ్మనకోపించి తన పాదుకనాతనిపై విస

రెను. అది తగిలి రామకృష్ణుని పల్లొకటి యూడెను. పరాభ వింపఁబోయి పరాభవింపఁబడితిమిగదాయని చింతించుచు రామకృష్ణుఁడింటికి జనెను. మరునాఁడు సభ కేఁగినచోనందఱు నవ్వుదురని యాతఁడు దుప్పికొమ్మును జెక్కి పంటిసందున నమర్చుకొనెను.

మఱునాఁడు కవిపండిత గోష్ఠిలో రాయలు సమస్యా పూరణము ప్రారంభింప ననుజ్ఞనొసంగెను. పలువురు పలు విధములైన సమస్య లొసంగుటయుఁ గవులు తమతమ చాతు ర్యములు మెఱయఁ బూరించుటయు నిరంతరాయముగ సాగి పోవుచుండగా నొకకవి 'రవికానని చోఁ గవికాంచునేగదా !' యను సమస్య నొసఁగెను. రామలింగనిచే నిదివఱలోఁ బరా భూతుఁడై ప్రస్తుతమాతని పంటియుదంతము నెఱింగిన కవి యొకఁడు రామకృష్ణునిపైఁగల పగసాధించుకొనుట కదియే తగిన తరుణమనియెంచి యిట్లు పూరించెను—

ఉ. ఆరవి వీరభద్రు చరణాహతి డుల్లిన బోసినోటికిన్.
నేరఁడు, రామలింగ కవి నేరిచెఁబో మనముక్కుతిమ్మన
క్రూరపదాహతిం దెగిన కొక్కిరిపంటికి దుప్పికొమ్ము ప
ల్గా రచించినాఁడు రవిగానని చోఁ గవిగాంచునేగదా!

ఇది విని రాయలు పూర్వవృత్తాంత మేమని యడిగెను. పద్యముఁ జెప్పినకవి తిమ్మనయింట జరిగినయుదంత మును విన్నవించెను. రాజును సభ్యులును పొట్టచెక్కలగు నట్లు నవ్వసాగిరి. తాడిఁదన్ను వాని తలదన్నువాఁడుండును!